శ్రీరస్తు

# విషయసూచిక.

శ్రీ పరబ్రహ్మణే నమః.

## పీఠిక.

శ్రీ పరమేశ్వరావతారములును, సత్పురుషుల చరిత్రంబులును, సాధ్వీమణుల కథలును, గల 'శ్రీసత్కథామంజరి' యను నీగ్రంథము, చిరంజీవినియు, నా మేనగోడలు నగు సుందమ్మ యిష్టపూర్తికై నాచే నాఱేండ్ల క్రిందట నే విరచిత మయ్యెను; గాని, యింత దనుకఁ గారణాంతరముచే ముద్రాయితము కాలేదు. అందు నియ్యది మొదటిసంపుటము. ఇందుఁ గథకు నినువది యేడు పద్యములు గల తొమ్మిది కథలు గలవు.

పండితాగ్రేసరులగు మహనీయుల కేతద్గ్రంథకర్త యొనరించు పద్యరూపక మగు విజ్ఞాపన :—

చ. ఇలఁ గలసత్కవి ప్రకర * మెంతయు లక్షణవేత్తలై సభా
స్థలులఁ జెలంగు పండితవి * తానము లుం దమకూర్మిపుత్త్రియుం
జెలియలుఁ గాఁ దలంచి ననుఁ * జిత్తముల న్గరుణించి తప్పుల
న్గనిగినఁ జూచి దిద్దుదుర * గాత క్షమింతురు గాత నిచ్చలున్ !!

కాకినాడ,
10-4-07.

ఇట్లు
గుండు వాసుదేవశాస్త్రి.

# శ్రీ సత్యాభామఞ్జరి.

## శ్రీ రామకృష్ణుల చరిత్ర.

---

క. శ్రీరామకృష్ణు లఘజా
ఢ్యారిసురభిషక్సయోఘు లై దేవకికిన్
శూరవసుదేవునకు యదు
వీరులు పుట్టిరల శేష విష్ణ్వంశములన్. 1

ఉ. ఖ్యాతిని రోహిణీజనని గర్భము ప్రోచెను రాము నయ్యశో
దాతనయ న్మహాప్రకృతిఁ దాఁ గొని కృష్ణుని డించి వచ్చి ప్రా
ణాతురుఁ డైన శత్రునిభయంబున రక్షణ జేసెఁ దండ్రి క్రో
ధాతిశయోగ్రరూపధరుఁ డై కనెఁ గంసుఁడు తత్కుమారికన్. 2

చ. పొగిలెడి దేవకీవనిత పొత్తిటిబిడ్డను ఊత్తిసైఁ దలం
బగులఁగ నీడ్చి కొట్టిన నభంబున వెల్గుచు నిల్చి మాతులుం
దెగడుచు యోగమాయ తనదివ్యశరీరము దాల్చి సద్విమా
నగమన యయ్యెఁ గృష్ణుఁ డిట నందయశోదలబిడ్డఁ డై మనెన్. 3

చ. కలఁక జనించునెమ్మదిని గంసుఁడు పూతనపేరిరక్కసిం
బిలిచి మహీస్థలిం బురిటిబిడ్డలఁ జంప విధించి యంపినం
జలమున దానిరక్తము విషంబును బ్రాణములున్ హరించెఁ గ
న్నులయిన విప్పలేని తఱి నోరు నెఱుంగని కృష్ణుఁ డత్తఱిన్.

సీ. మూడవనెల నిండువేడుక యగునాఁడె
బండిరక్కసుఁ దన్ని గండడంచెఁ

బదిరెండునెలలు నేర్పడునాఁడె సుడిగాలి
రక్కసు జట్రాతి నుక్కడంచెఁ
దల్లికినావులిం తను మన్ను దినునాఁడె
విశ్వరూపము జూపి విఁత గొల్పె
గర్గునిచే నామకరణాదుల గ్రహించి
యగ్రజుతో నాట లాడఁ జొచ్చె
గీ. నమరమునిశాప యక్షవృక్షములఁ గూల్చెఁ
బండ్లు గొని యిచ్చు వెల మణిప్రతతిఁ జేసె
జడుపు దీర్చిన తల్లికిం జనవు చూపె
ఘనుఁడు బాలకృష్ణుఁడు బృహద్వనమునందు.
ఉ. వేపురరక్కసు ల్పరిభవింపఁ దలంచుటఁ జూచి భీతిచే
గోవులు గోపసంతతులు గొల్వఁగ నందుఁడు పల్లెనుండి బృం
దావనసీమఁ జేరె యమునానది చెంగట నాటలాడుచుం
దీవిగ రామకృష్ణులు నటించిరి బాలురఁ గూడి వేడుకన్.
సీ. వత్సాసురునిఁ జిత్ర వధజేసి బకదైత్యుఁ
జెండి యఘాసురుం జీల్చి వైచె
బ్రహ్మమనోగర్వ భంగంబు గావించి
ధేనుకాసురబలోద్దీప్తి వాపె
మాయాప్రలంబదుర్మదనాశన మొనర్చి
గోగోపకప్రాణకోటిఁ బ్రోచె
కాళీయఫణిదర్పఖండనం బొనరించి
కార్చిచ్చుమ్రింగి సంకటము దీర్చె

తే. ధర్మవిధిఁ గన్యకావస్త్రతతి నొసంగి
మునిసతీదత్తసత్రాన్నమును భుజించె
యమరతతి మెచ్చ గోవర్ధనాద్రి యెత్తె
కృష్ణుఁ డింద్రశక్తి హసించి కీర్తికెక్కె. 7

చ. వరుణునిదూత నందుని నవారణఁ గైకొని పోవఁ దత్పురం
బరుదుగఁ జొచ్చి కృష్ణుఁడు తదర్హసమర్చన లంది తండ్రి సం
బరమునఁ దోడి తెచ్చి మహిమాస్పదమై తగు విశ్వరూపముం
గరుణను జూపి గోపకుల గౌరవసంపద గాంచె దక్షుఁడై. 8

ఉ. కిన్నరసిద్ధసాధ్య సురఖేచరగాన తిరస్కృతిస్థితిన్
వెన్నుని వేణునాదము నవీనగతి న్విలసిల్ల గోపికల్
మన్ననఁ జూప వారల సమస్తవిధంబుల గారవించె న
వ్వెన్నలదొంగ లోకముల వెల్గఁ గఁజేసెడి వెల్గుమూర్తితోన్. 9

మ. ఘనమౌ సర్పమునందుఁ బట్టి దిగమ్రింగన్ భీతులై గోపకుల్
వనటం జెందిరి కృష్ణపాదహతి శాపప్రాప్తి వాయ న్సుద
ర్శనవిద్యాధరుఁడై హరిం బొగడె నాశ్చర్యంబుగా నందుఁడు
న్మనియె న్గోపికలెల్లరు న్మదిని బ్రహ్మానందముం బొందఁగన్. 10

గీ. శంఖచూడుని వృషభరాక్షసు వధించి
కేశిఁ బడనేసి నారదోక్తిని గ్రహించి
క్రూరు యమపుత్రుఁ ద్రుంచి యక్రూరుఁ గాంచి
యగ్రజునితో మధురఁ గృష్ణుఁ డరుగఁ దలఁచె. 11

ఉ. వేగమె నందముఖ్యులు వివేకధను ప్రభునాజ్ఞ నర్ధను
ర్యాగము చూచు వేడుకఁ బ్రయాణములై శకటంబులందుఁ బా

మీఁగడ పెర్గు నేయి మిసిమిం దగు వెన్నయు జున్ను పాల్మీఁద
ల్గాఁగల భాండము ల్తగిన కానుకలుం గొనివచ్చి రున్నతిన్. 12

శా. అక్రూరుం గని రామకృష్ణులు తదీయస్యందనం బెక్కఁ జో
నాక్రోశించిరి తద్వియోగజనితవ్యామోహులై గోపిక
ల్నక్రిస్తుత్యులు వేగ వత్తు మనుచున్ స్వాదూక్తులం బోవున
య్యక్రూరుం డట విశ్వరూపము ప్రభూతాశ్చర్యుఁడై గన్గొనెన్. 13

చ. ఘనమధురాపురోపవనకంఠమునం డిగి రాడ్దుకూలము
ల్గొని రజకు న్వధించి హరి కూరిమి గోరుచు వస్త్రమాల్యగం
ధనికర మిచ్చువాయకసుదామత్రివక్రల గారవించుచున్
ధనువు పెళుక్కునన్ విఱిచెఁ దత్పరిపాలురఁ గూల్చె రాముఁడున్.

సీ. రాముతమ్ముఁడు మల్లరంగమార్గనిరోధ
కువలయాపీడంబు గూలనేసి,
బలుఁడు తోడ్పడ నిల్చి బాహుయుద్ధ మొనర్చి
మల్లపంచకమదోన్మదము బాపి,
తముకట్టఁ జూచి బాంధవులఁ జంపఁ గడంగు
కంసాధముని దీవ్రగతి వధించి
జననీజనకముఖ్య సద్బంధుజనుల సం
కెల లూడ్చి సద్భక్తి కీలుగొల్పి
యుగ్రసేనుని రాజుగా నుద్ధరించి
శక్రదత్తసుధర్మ సత్సభ నొసంగి
ప్రేమమీఱ నందాదుల న్వీటి కనిపి
యగ్రజుఁడుఁ దాను దలిదండ్రు లలర మనిరి. 15

చ. హరియును రాముఁడు న్వటువు లై వ్రతదీక్షను స్వీకరించి స
ద్గురుకులవాసులై కళలఁ గోవిదులై గురుదక్షిణార్థ మై
యరుదుగ సాగరోదరము నందలి పంచజను న్వధించి య
బ్బురముగ ధర్ముఁ గాంచి గురుపుత్త్రుని దెచ్చి రుదాత్త విక్రముల్. 16

ఉ. వారల రాకఁ గాంచి యదువర్గము మే లనఁ గృష్ణుఁ డుద్ధవుం
గూరిమి నంపి నందుఁడును గోపికలు న్ముద మందఁ జేసి కు
బ్జారుచిరాంగి సేవఁ గొని చక్కఁగ నక్కురురాజు చేత ల
క్రూరుని చేత గుర్తెఱిఁగి గుంతిని బ్రోవఁ దలంచె నెమ్మదిన్. 17

శా. జామాత న్బలుఁ గంసుఁ జంపిన జరాసంధుం డెదుర్ప న్సర
ల్మిక్రీమీఱ నర్థయుగ్మ మంప బలుఁడున్ శ్రీకృష్ణుఁడు న్వీరసం
గ్రామక్రీడ నొనర్చి గెల్చిరి కడంక న్వాఁడు సైన్యంబుతో
సామర్థ్యంబునఁ బోరుచుం జనుచు మాత్సర్యంబు మైఁ ద్రిమ్మరెన్

సీ. కలహాశనునిబోధ గలకాలయవనుండు
దండెత్తి వచ్చె నుద్దండలీల
నక్షౌహిణులతోడ నలజరాసంధుండు
దాడిగాఁ జనుదెంచు నేఁడొ రేపొ
యని సముద్రస్థలిన్ ఘన పురి ద్వారకం
గట్టించి యాదవాగ్రణుల నిలిపి
తఱిమి శత్త్రువు వెంటఁ దగుల నమ్ముచికుందు
చే వానిఁ జంపించి సేన నొంచి

గీ. యగ్రజునితోఁ బలాయితుఁ డైనకృష్ణుఁ
గని ప్రవర్షణాద్రిని దాహ మొనరఁ జేసి

ఘోర నలజరాసంధుఁ డయ్యోగమూర్తు
లిలకు లంఘించి పురిఁ జేరి రెలమితోడ. 19

ఉ. రైవతకుండు పుత్త్రికను రామున కిచ్చెను కృష్ణుఁ డష్టభా
ర్యావరుఁడై చెలంగి నరకాసురునిం బరిమార్చి యాపదా
ర్వపురరాజకన్యలఁ బెండిలియై సురభూరుహంబు న
త్యావననాటి నాటె దివిజావళిఁ గెల్చె త్రిలోకపూజ్యుఁడై. 20

సీ. సతికిఁ బదొండ్రుగా సుతు లుద్భవిల్లిరి
శ్రీకృష్ణుఁడును ముద్దుచేసి పెంచ
ననిరుద్దునివివాహ మొనరించి బలునితో
నెత్తమాడుచు రుక్మి నేలఁ గూలెఁ
గరములు నఱికి ముష్కరబాణదైత్యు చే
మను మనిభార్యతో మనిచెఁ జక్రి
బలుఁడు వేపల్లెబంధుల్లతో జలక్రీడ
కై పిల్వఁ గాళింది కదలకుండె

గీ. హల మతఁడు బూని నూఱు కాల్వలుగ నీడ్చె
శరణ మని యామె వస్త్రభూషణము లిచ్చె
శాంతి గొనె సీరి కృష్ణుఁ డాచెంతఁ బౌండ్రు
గాశిరాజుతోఁ బరిమార్చె ఘనభుజుండు. 21

మ. కురురాజాత్మజఁ గొంచు సాంబుఁ డరుగం గోపంబుతో నాతనిం
జెఱలోఁ బెట్టినరాముఁ డల్గి హలముం జేపట్టి యాహస్తినా
పుర మెల్లం బెకలించుచున్న తఱి నాప్తుం డౌచు రారాజుహ
తుర నల్లుం డని వారిఁ దెచ్చి యిడె సంతోషించె నవ్వీరుఁడున్. 22

సీ. ఘనశమంతకపంచకమున సూర్యోపరా
గస్నానఁ గూడి యగ్రజుఁడు దాను
ధారుణీశ్వరుల నందయశోదలను గోపి
కాస్త్రీల మానిసంఘములఁ గాంచి
యన్యోన్యవిధులవారి నలరించి వసుదేవు
నధ్వరరక్షణం బాచరించి
నందాదులును బంధుబృందమ్ములును దాము
నెమ్మి నచ్చట మూఁడునెలలు నిల్చి
గీ. దేవకీదేవికోరికఁ దీర్పఁ దలఁచి
సుతలమున కేగి తెచ్చిరి సోదరులను
క్రతుసహస్రి మొనర్చి రప్రతిములయిన
రామకష్ణులఁ బొగడఁ దరంబె జగతి. 23

ఉ. సాళ్వుని దంతవక్త్రముఖశత్రుల గూల్చెను జక్రి రాముఁడున్
బల్వురు బాంధవుల్ బలియు పాండవయుద్ధము రోసి తీర్థయా
త్రల్వడిఁ జేయుచు న్మునిహితంబుగ యాగవిరోధిరక్కసున్
వల్వలుఁ ద్రుంచె మున్ ద్వివిదవానరుఁ బట్టివధించు చాడ్పునన్. 24

చ. విజయుని గూడి విష్ణుఁ గని విప్రతనూజులఁ దెచ్చి యిచ్చె స
ద్ద్విజుఁ డగు నా సుదేవుఁడు విదేహుఁడు సల్పెడు పూజ లందె న
క్రజముగ నాక్రమాణె భువిఁ గాచెను రాక్షసశిక్షణంబునన్
నిజ మగు యోగశాస్త్రమును నిర్మితి చేసెను కృష్ణుఁ డిద్ధరన్. 25

సీ. రాజసూయము ధర్మరాజు సల్పెడినాఁడు
శిశుపాలుఁ దెగటార్చి శ్రీయ యొసఁగె
ఖాండవదహనాది కార్యంబులెకుఁ దోడు
పడి యర్జునునకు సుభద్ర నిచ్చె
శౌర్యోన్నతుని-జరాసంధు భీముని బంపి
బాహుయుద్ధమునందు భంగపుచ్చె
గౌరవఘోరసంగ్రామజయం బిచ్చి
ధర్మజు రాజుఁగాఁ దనరఁ జేసె
గీ. వస్త్రదాన మొసంగి ద్రౌపదిని బ్రోచె
జీవము నొసంగి యాపరీక్షితుని గాచె
బాండుసూనుల పాలికల్పద్రుమంబు
కృష్ణుఁడాదిమవిష్ణుండు కేవలుండె. 26
క. ధీరు లసమానవిద్యా
పారగులు సమస్తసుగుణభాషితులు మహా
వీరులు వారలఁ బొగడఁగ
నేరికిఁ దర మాను భక్తి యే ముఖ్య మగున్. 27

# శ్రీసత్కథామఞ్జరి.

## శ్రీ రుక్మాంగద చరిత్రము.

క. శ్రీరుక్మాంగదుఁడు యనూ
ద్యారూఢాష్టాంగసిద్ధుఁడై స్వప్రజలోఁ
గూరిమి హరివాసర దీ
క్షారంభుం డయ్యె దేవతాళి నుతింపన్. 1

శా. ఆపుణ్యవ్రత మాచరించు ఫలమో యన్నట్టు లెవ్వేళల
న్ప్రాపై మేఘుఁడు వర్షము న్గురియుచు న్భాసిల్లు ముక్తాఫలల
జ్జూపట్టు న్వసుధాస్థలి న్భరిత మౌచు న్బంట పై రెల్లెడ
న్ప్రాపింపం బని లేకయుండె శమనప్రాగ్ద్వార మెవ్వారికిన్. 2

క. అప్పుడు సమవర్తిని గని
చెప్పెను నారదుఁడు నృపతిశీలము నతఁడా
చొప్పెఱిఁగి భారతీపతి
కప్పగిది వచింప నేగి యవనతుఁడైనన్. 3

ఉ. అత్తఱిఁ బద్మసంభవుఁ డహస్పతిపుత్త్రుని దేఱిచూచి నీ
చిత్తము ఖిన్నతం బొరసి చేడ్వడుకారణ మేమి? నాఁగ, మ
త్ప్రత్తన మెల్లఁ బాడువడెఁ బాపులు స్వర్గనివాసు లైరి యీ
క్రొత్త జనించు టెట్లు తమకు న్వశదం బది కాకయుండునే?

క. పంచమహాపాతకులును
మించి విమానముల నెక్కి మెఱసి వికుంఠం

బంచితగతిఁ జనుచుండిరి
మంచి ఖేదుగు లింక నెవ్వి మదిఁ జర్చింపన్. 5

ఉ. దండుగ చిత్రగుప్తులు వృథా దినచర్య లిఖించు టేల, నా
దండము త్రుప్పుపట్టె, యమదండన స్వప్నపువార్త యయ్యె, ను
ద్దండ దురాత్ములు న్హరిపదంబున కేగెడువుణ్యు లైరి కై
కొండిరె; పాశదండములకు న్వలి యాయె నటంచుఁ బల్కెనన్. 6

చ. కలకల నవ్వి నాలుగు మొగంబుల నాహరివాసరవ్రతం
బలఘుతరప్రభావ మగు నైనను విఘ్న మొనర్పఁ జూచెద
న్గలఁగకు మంచుఁ దత్పురికిఁ గాలుని బంచి సురూపయౌవనో
జ్జ్వల యగు మోహినీసతిని సారసగర్భుఁ డొనర్చి యిట్లనున్. 7

క. లలనా! రుక్మాంగదభూ
వలయాధిపుఁ డాచరించువ్రత ముడిగింప
న్వలయు నని చెప్పి చెలుల
న్బలు మృగముల సృష్టిజేసి పద్మజుఁ డనిపెన్. 8

ఉ. తప్పక నేల యీగినవిధంబున బెబ్బులిపిండు సింగము
ల్దుప్పులు నేదుపందులును దొడ్డసివంగులు పట్టనంబునం
దెప్పలుఁ గుప్పలైనటుల దీమసమెత్తి జనంబు నొంప వేఁ
డప్పలు వాలకించి మృగయావ్యసనోన్ముఖుఁడై చనె న్వనిన్. 9

ఉ. మంచి కరాళ వక్త్రశిత మార్గణ పంక్తుల సింహసాళ్వము
లాంచనబాణ జాలముల ఖడ్గ వరాహములాయు కోటుల
న్గాంచక త్రుంచిత్రుంచి మదకుంజరయూథము నుగ్గుచేసి ప్రా
పించెను వామదేవునటవీస్థలి రాజవరుండు సేనతోన్. 10

ఇష్టకామేశ్వరు నిమ్మంధరాద్రిపై
సేవింపు మని మౌని చెప్పి యంపె
సేనల నట నిల్పి శీఘ్రము మచ్చటి కేగ
నమ్మోహినీరూప మరయనయ్యె
వీణియ మొరయించి వివిధరాగాలాప
ములఁ జేసి యలరించె ముద్దుగుమ్మ
యజునాజ్ఞచే మారుఁ డలరుములు (గ్రాలు) వింట
సంధించి బెగడింప సాహసించె
నిష్టకామేశ్వరునిప్రోల నెన్ని యేని
బాస లొనరించి మోహినీభార్యతోడ
రాజశేఖరుఁ గొనియాడి రాజ్యమునకు
సేనతో వచ్చె నా రాజశేఖరుండు. 11

శా. మాత ల్సంతసమందఁ దండ్రి కెదురై మర్యాద రుక్మాంగదుం
డేతేర న్వరపుత్ర రమ్మనుచు నుర్వీజాని తన్మోహినిన్
బ్రీతిం జూపి త్వదీయమాత యనుడు న్వీక్షించి యాయిద్దరిన్
జేతు ల్మోడ్చి భజించి వేడ్క నగరుం జేర్చె న్సుతుం డత్తరిన్ 1

సీ. సంధ్యావళీదేవిసదనంబునకు నేగి
జరిగినకథఁ జెప్పె ధరణిభర్త
తద్వార్త నాలించి తలిరుబోణి యొక్కర్తు
శతసతీనివహావిశ్రుతము చేసె
ననలంబు తలిరాకు నాచినయట్లైనఁ

దాళ్ళఁజాలక హర్మ్యతలముల విడనాడి
విలపించి రట నిల్చి వెలఁదు లెల్ల
నపుడు పట్టపుదేవి ధైర్యాద్రి యగుచు
వారి నూరార్చి పతిభక్తి గౌరవించి
వస్త్ర వర భూషణోజ్వల భాసితాంగుఁ
గ్రొత్తసవతి కర్పణ చేసెఁ జిత్తమలర. 13

క. ధారుణిఁ గుమారుఁ డేలఁగఁ
గోరిమి భార్యాశతంబుఁ గోరక వేదా
చారంబు విడిచి హరిచిం
తారతియు న్మఱచి పోఁడు ధాతృనియుక్తిన్.

శా. ఇచ్చ న్నందియ మొందుచుం జననిమో మీక్షించి ధర్మాంగదుం
డిచ్చో నేమియుపాయమో తెలుపుమీ యీసద్వ్రతోల్లంఘన
న్వచ్చుం దోషము రాజునాజ్ఞఁ గడవ న్భావ్యంబుగా దమ్మహి
న్వచ్చె న్గార్తికశుక్లపక్ష మనుచు న్వాక్రుచ్చె భీతాత్ముఁడై. 15

గీ. అత్తలోదరి చిఱునగ వాఁపిపైచి
తలవరులఁ బిల్చి నాల్గువీథులను జాట
నాజ్ఞ యొనరింపు మవల శ్రీహరియు లేఁడె
యనుచు వచియించె నాత్మజుం డట్లొనర్చె. 16

సీ. ఓహో! మహీధవుం డుగ్రశాసనుఁ డౌట
శ్రద్ధాళురగుడు భూజనములార!
కార్తికైకాదశీ ఘనపుణ్యదివసంబు
హరివాసరశ్రేష్ఠ మయ్యలార!

క్షీరాబ్ధి మేల్కాంచి శ్రీలక్ష్మి విష్ణుండు
బుడమికి నేతెంచుఁ బుణ్యులార!
దశమి వ్రతాది ద్వాదశి వ్రతాంతం బార్య
సమ్మతాచారంబు సాధులార!
యనుచు భేరులు మొరయించి యఖిల దిశల
భద్ర దంతావళంబుతో బయలు దేఱి
నిల్చి నిల్చి వాక్యార్థంబు నిర్ణయించి
చాటి రప్పుడు యువరాజుశాసనంబు. 17

సీ. జయభేరినినదంబు వీనులకు గర్జారావమ్మైన భూ
దయితుం డించుక యాలకించి వినుటన్ దైత్యారినామావళీ
మఱియు న్మై తోఁప మహోక్రమా ర్వనిన సన్మాన్యవ్రతారంభని
ర్ణయకాలంబు వచింపఁ బాన్పు డిగియె న్నారాయణధ్యానుడై. 18

మ. చెఱఁగు ల్చక్రాఁగఁ జెక్క నిల్వఁబడి నిశ్చేష్టత్వముం జెంది ముం
గురు లొక్కించుక గీఱి కొప్పిడి నృపుం గోపించి నిట్టూర్పుతోఁ
దరుగం జూచి వచింపఁ బోయి మరల స్థనత్వముం జూపి, ని
ష్ఠురత న్బల్కెడు మోహినీయువతికి న్సూర్యాన్వయుం డిట్లనున్ 19

ఉ. వారిజపత్ర నేత్ర! హరివాసరసద్వ్రత మాచరింతు, నీ
దారుణ భంగి మాని విను తద్వ్రత మీతిథి నేకభుక్త
న్వారకచేసి ఱేపు నుపవాసము జాగరణంబు ద్వాదశీ
పారణయున్ వ్రతాచరణ పద్ధతి యై విధియుక్త మై తగున్. 20

క. అని తలుపు తీయుసతనిం
గనుంగొనుచు నగ్రభార్య కౌతుక మొంద

న్యని మించు ననుచు నమ్మో
హినీవనిత యిట్టు లను మహీవిభుతోడఁ. 21

చ. నిను విడనాడ నెన్నటికి నిక్కము నిక్కము నమ్ము నమ్ము నా
వనితలఁ దేఱిచూడ నొకపల్కునకేనియు మాఱుపల్క నో
వనజదళాయతాక్షి యని బాసలొనర్చి నరేశ్వరా యుమే
శుని శిరమందుఁ జే యిడిననూనృతవాక్యము రిత్తవుత్తువే! 22

చ. హరిహరి యించుఁ గర్ణముల నాచికొనం దగినంతపాప మె
వ్వరుసున సంభవించె హరివాసర మన్వలుకైనఁ బల్కితే!
పురుషుల నమ్మఁగాఁ దగునె మోసమొనర్చెద వీవటంచుఁ ద్వ
చ్చరణములాన నే నెఱుఁగఁ జాల నటంచు వెలంది పల్కినన్.

సీ. అపకీర్తిపాల్సేయ నరుదెంచె సతి యంచు
మది నిర్ణయించె ధర్మాంగదుండు
సాక్షివిహితధర్మసరణిని బోధించు
నట్టిబుద్ధులు చెప్పె నగ్రభార్య
చిరపరిచిత మైన శ్రీవిష్ణుపదభక్తి
సమయించితె యని పల్కె సవతిపిండు
సత్యవాక్యద్రోహసరణికిఁ గొంకని
వ్రత మెట్టి దని పల్కె బ్రహ్మపుత్రి
లలనరో! పుత్రమిత్రకళత్రములను
సకలసామ్రాజ్యమును బాయ సాహసింతు
నాఱు న్నూరైన నూఱాఱు లైనఁ గాని
వ్రతము విడఁజాల నని మహీపతి వచించె. 24

శా. ఈవేదాంతముఁ దెల్పు పత్ని లేదు గై యీక్షించుచు న్నిల్వఁగ
న్నావే సూనృతవాది నైన సుతుని న్మర్దించి యేకాదశిన్
శ్రీవిష్ణు న్భజియింపు మప్పనికి నీ చేయాడిన న్లైన నే
నీవైరాగ్యము చూతుఁ గాక యని యయ్యేణాక్షి వాక్రుచ్చినన్ 25

మ. తగు నేకాదశి నిట్టికార్య మనుచున్ ధర్మాంగదుం డాడిన
న్జగతీనాయక తెంపు సేయు మనుచు న్సంధ్యావళీదేవి నా
వగ లోలోన నడంచి సత్యనిరతి న్వజ్రాయుధం బుగ్రభం
గిగ రాజన్యుఁడు తాల్చి నిల్చె తనయగ్రీవంబు ఖండింపగన్. 26

ఉ. తాళుము తాళు మంచు హరి తామరసాలయ కోల్వ వచ్చి కెం
గేల నదల్చి పట్టె సురకీర్తనము ల్సెలరేఁగ భూవిభుం
డోలి నుతించె శ్రీపతి మహోన్నతసౌఖ్య మొసంగుచు న్సుతుం
జాలన చేసె మోహిని నెపంబున నానృపకీర్తి మించఁగన్. 27

# శ్రీ సత్కథామఞ్జరి.

## శ్రీ ధ్రువచరిత్రము.

క. శ్రీరమ్యరాజ్యగరిమన్
ధారుణి నుత్తానపాదధరణీపతి చె
న్నారు సునీతి సురుచి దే
వేరులుగా నగ్నిదీప్తి విలసితుఁ డగుచున్. 1

శా. ఆరాజన్యున కగ్రజాతుఁడు ధ్రువుం డైదేండ్లబాలుండు సిం
గారం బొలయఁ బసిండిమే నాలయ నిక్కం బౌ మనోధైర్యముం
దోరం బై కనుపట్టఁ జిన్నినడలం దోతెంచి లేనవ్వుతో
గారా మొప్పఁగఁ దండ్రిపెందొడల నెక్కంబోవుచున్నంతలోన్.

క. చూపోపక సురుచి మదిని
గోపము జనియింప సవతికొమరున కను నో
పాపఁడ! నిలు మెట కేగెదు
నాపతితొడ నెక్క నీకు న్యాయమె చెపుమా. 3

ఉ. పుట్టితె నాదుగర్భమున! భూనుత సద్వ్రతకోటి సల్పితే
మెట్టితె సర్వతీర్థములు మేను గృశింపఁ దపం బొనర్చితే
పుట్టెడు కోరిక ల్గదురఁ బొంగుచు వచ్చుచునుంటి వార నీ
కెట్టు లభింపనోపు ధరణీశ్వరునూరుగతోడుసంపదల్. 4

క. ఈచెనఁటిబుద్ధి నీకుం
దోఁచెనొ యటు కాక గర్వదూషితమతి నా
లోచించి సవతి తెలిపెనొ
నాచిఱుతనిసొత్తు సొమ్ము నగరికి వెలిద్యా. 5

మ. అని పిన్నమ్మ యదల్చి పల్కె జనకుం డమ్మాట లాలించియుఁ
వినన ట్లూరక యుండె బాలకుఁడు నిర్వేదంబు రెట్టింప నె
న్వెనుకం దగ్గి గిరాలున న్మరలి వెన్భీతి న్విలోకించుచుం
జని తల్లిం గని మోము వంచుటయు నాసాధ్వీలలామం బనుఁ. 6

క. ఆతల్లి యేమి యనెరా
నాతండ్రీ కంటినీరున న్వచ్చితివే
నీతండ్రి చూచుచుండెనె
యీతలవంపు లగుచేఁత లెట్లు భరింతుఁ. 7

గీ. అని కవుంగలించి యాననం బెత్తిన
యమ్మమోముఁ గాంచి యావు రనుచు
నేడ్చుచున్న బాలు నెల్లరు నీక్షింప
నాలగోలు బాలగోలు నయ్యె. 8

ఉ. అప్పుడు కంటినీ ర్తుడిచి యల్లన బాలుని బుజ్జగించుచు
న్జెప్పెను నాయనా! సవతి చిన్నతనం బొనరించి యంపెనో
యెప్పటియట్ల మీజనకుఁ డిచ్చమెయి న్నిను గారవింపఁడో
యొప్పులకుప్ప యన్న ధ్రువుఁ డొయ్యనఁ దల్లిని జూచి యిట్లనుఁ.

క. అమ్మా! తప మన నెయ్యది?
యెమ్మాడ్కి నొనర్ప దేవుఁ డిచ్చ నలరువాఁ
డమ్మేటి నామరూపము
లెమ్మాదిరి బోధచేయు మెఱిఁగితివేని. 10

చ. అన విని బాష్పము ల్దొరఁగ నక్కునఁ జేరిచి తల్లి పుత్త్రకా
నినుఁ గని మాఱుతల్లి యిడునిష్ఠురకష్టము లోర్చుచుంటి నా

కనులకు నీవునుం గఱవు గావలె నంచును బోధచేసి యి
ట్లనిపెనె తండ్రి చూడ నకటా! విధి నాదెస నెంతకష్టకారుఁడో! 11

క. చూడ ముకుఁబచ్చ లాఱని
వాఁడవు నీవేడ వేదవాఙ్మయతత్త్వం
బేడఁ దప మేల్లరా యీ
యీడున కీఁబ్రహ్మహత్యయే యనురీతిన్. 12

మ. అనుచుం బెక్కుతెఱంగులం దెలిపి ధైర్యాలంకృతోద్భాసియై
వినకుంట న్వరమేశురూపగుణము ల్వేమాఱు వర్ణించి భ
క్తిని నెక్కొల్పెడువాక్యబోధ ననురక్తిం జల్పె నబ్బాలుఁడు
జ్జననీ! వచ్చెద నంచు మ్రొక్కి తపము న్సాగింప నేగె న్వెసన్.

క. చనిచని వనమున నారద
మునీశ్వరుని గాంచి వినయమున మ్రొక్కుటయు
న్మనమున ననుకంప గదుర
జనన్నాథతనూజుఁ జూచి సంయమి పలికెన్. 14

ఉ. ఒంటిగ జరించుచుంట తగదో యి కుమారక మోము వంచెదే
కంటికి నీర దేమి మది గాసిలఁబోకుము యోగదృష్టిఁ గ
న్గొంటిని సర్వము న్నిను ముకుందుఁడు ప్రోచునుగాత రమ్ము మీ
యింటికి నంపి వత్తు ననె నీశ్వరునిం గనఁ గోరె బాలుఁడున్. 15

శా. శ్రీలక్ష్మీపతిద్వాదశాక్షరిన్ మునిశ్రేష్ఠుండు బోధించుచు
న్నీలం బొప్పఁ బఠింపుమీ యనుచు నిచ్చె న్యోగలక్ష్మ్యాదులన్
బూలుం బండ్లుఁ జెలంగునమ్మధువనమ్మున్ జేరి బాలుం డెద
న్నేత్రాలంచు న్యమునానదీతటము నెమ్మిం గాంచి సంప్రీతుఁడై. 16

ఉ. అప్పుడు రాచపట్టి పరమాత్ముఁ దలంచుచుఁ బెక్కునేమముల్
దప్పక త్రొల్చుచు న్దప ముదగ్రతఁ జేయఁ దొడంగె నిర్దయుం
దప్పియు నాఁకలి న్మఱచెఁ దాపసు లచ్చెరు వొంద లోకము
ల్మెప్పిరి గొన్నివేండ్రమున ముప్వురువేల్పులలోఁ జలింపఁగన్. 17

క. ఈగతి నొప్పెడు ధ్రువునిన్
భోగివలయుఁ డౌ ననంగ ఋషులు నుతింప
న్వేగఁ గనవచ్చె శ్రీహరి
లేఁగను గనవచ్చు నావులీల దనర్పన్. 18

క. ఒకచెంపఁ గొట్టఁ బాలు మ
ఱొకచెంప న్గొట్ట నీరు నోహో బాలుం
డకలంక తపశ్శక్తిని
సకలేశ్వరుఁ గాంచె నంచుఁ జాటిరి దివిజుల్ 19

ఉ. మేటి కిరీటము న్సిరియు మేలిమిరత్నము వైజయంతియున్
హాటకచేలము న్నుడుద యైనకన్నుంగవ న్నాల్గుచేతులుం
జాటి పరాత్పరుం దెలుపఁ జొగిలి మ్రొక్కెను బాలుఁ డోజగ
న్నాటకసూత్రధారి కరుణన్ దరముం గొని దువ్వఁ జెక్కులన్.

సీ. వేదాత్మకం బైనవిష్ణుశంఖస్పర్శ
చే శక్తి గల్గి దేవేశ సర్వ
మయుఁడవు నీవె చిన్మయపరబ్రహ్మంబ
వీవె వేదాంతార్థ మీవె కావె
సత్వసత్వం బీవె షడ్గుణాతీతుఁడ
వీవె దివ్యజ్యోతి వీవె కావె

నిరతిశయుఁడ వీవె నిత్యమూర్తివి నీవె
లో వెలి వెలిఁగెడ వీవె కావె
యని వినుతిసల్ప బాలకుఁ డభిమతార్థ
మనుచు హరి యిర్వదాఱేవ్వేల నొనరు నేండ్లు
వసుధఁ బాలించి సప్తర్షివరప్రదక్షి
ణార్హమండలం బేలు స్తుత్యర్హముగను. 21

చ. అది యుగము ల్నశించుతఱి నైనఁ జలింపనిమండలంబు నీ
యదిగ నొనర్చువాఁడఁ జనుమయ్య పురంబునఁ దల్లిదండ్రుల
న్ముదమునఁ దేల్పుమయ్య యని మ్రొక్కులనంది భవిష్యదర్థము
ల్పదిలముగా వచించి చనె భక్తజనావనుఁ డాదరంబునన్. 22

శా. సాయుజ్యంబును వేఁడనైతిని గదా సంసారచక్రంబున
న్మాయాబద్ధుఁడ నై భ్రమించుటకు సామ్రాజ్యంబు ప్రాపించునో
కాయం బస్థిర మంచు నొచ్చుకొని లోకస్తుత్యు నాజ్ఞ న్పురిం
డాయ న్బాలకుఁ డేంచెఁ నారదుఁడు మింట న్వచ్చి రాజేంద్రుతోన్.

ఉ. ఏ మది చిన్నవోయెదు మహీశ్వర! మీసురుచీంద్రువక్త్రికు
న్నేమమెయామెపుత్రకుఁడు శ్రీయుతుఁ డై మనుచున్న నా నతం
డో మునివర్య యగ్రసుతు నుల్లమునం దలపోయుచుంటి న
య్యా మనియున్న నా న్విని శుభోక్తి వచించి చనె న్మునీంద్రుఁడున్.

సీ. ఆరాజవరుఁ డప్పు డగ్రభార్యను జేరఁ
బిలిచి పుత్రునివార్తఁ దెలియఁజెప్పి
పట్టణాలంకారపద్ధతిఁ నియమించి
చాటింపఁజేసి యమ్మేటిరాక

కెదురుగాఁ బల్లకు లెక్కి దేవులతోడఁ
గదలి యాధ్రువుఁ గ్రుచ్చి కౌఁగిలించి
యతని నమస్కృతు లంది దీవన లిచ్చి
పట్టంబు గట్టి సంబర మొనర్చె
శింశుమారప్రజాపతి శిఖిగురుండు
మామలుగఁ బ్రమియు నీలయు భామినులుగఁ
గల్పవత్సరోత్కరు లనఁగల తనయులఁ
బుత్త్రి నొకర్తుఁ బడసె నిద్ధాత్రి ధ్రువుఁడు. 25

క. తనయుని సుగుణోజ్వలు శ్రీ
జనార్దనాసక్తచిత్తు సంతానయుతున్
జననీజనకాదరుఁ గని
సునీతి సంతసము నొందుచు న్విలసిల్లెన్. 26

శా. పాలించె న్వరసేతు శీతమహిభృత్ప్రాంతోరు భూభాగముల్
మూలించె న్రిపుధైర్యమేరుశిఖరిన్ దోర్దర్పమే పారఁగన్
జాలించెం ఘనదేశవీరరణముల్ స్వాయంభువప్రీతికి
న్మేలెంచె న్హరియాజ్ఞ సత్క్రతువుల న్మించెన్ ధ్రువుం డిద్ధరన్. 27



# శ్రీసత్యధామఝరి.

## శ్రీరామచరిత్ర.

క. శ్రీదశరథరాజు సుపు
త్త్రోదయ మర్థించి యాగ మొనరించుతఱిన్
శ్రీదయితుని వేఁడిరి బ్ర
హ్మాదులు రావణవధార్థమై జనియింపన్. 1

మ. అభయం బిచ్చి తదుక్తిఁ దెల్పి హరి దేవానీకముం బంచెఁ ద
చ్ఛుభలగ్నంబున హవ్యవాహనుఁడు నిచ్చో బాయసం బిచ్చెఁ బ్రే
మ భరం బాటను గైక కగ్రమహిషీమర్యాదఁ గౌసల్యకు
న్విభుఁ డర్పించె సుమిత్ర కిచ్చి సవతుల్పెన్వేడ్క భక్షించుచున్.

మ. పొలఁతు ల్మువ్వురు గర్భచిహ్నములతోఁ బొల్పొంద సీమంతముల్
సలిపె న్వైభవయుక్తుఁడై దశరథక్ష్మాపాలుఁ డంతం దలం
పులు మాసంబులు నిండ షోడశకళాస్ఫూర్తి న్రమాభర్త కో
సలరాజాత్మజ కుద్భవించె జనరక్షాధాముఁడై రాముఁడై. 3

క. రణభీకర మగు నారా
యణ శంఖ మ్మొదవె భరతుఁ డనఁ గైకకు నా
ఫణి చక్రాంశంబుల ల
క్ష్మణశత్రుఘ్నులు సుమిత్రకాన్పరి ధరన్. 4

ఉ. బాలురు తల్లిదండ్రులకుఁ బండువు సేయుచు నాటపాటలం
దేలుచు వేదశాస్త్రముల ధీనిధులై విలువిద్య నేర్చుచో

మే లని గాధిజుండు పుడమిం గ్రతురక్షణ కర్థివచ్చి, భూ
పాల! మహోగ్రరాక్షసవిఘాతుని రాముని బంపు నావుడున్. 5
మ. పసిబాలుండు మహోగ్రదానవులఁ బాపం జాలఁ డోతండ్రి నే
నసి చాపాదులతోడ వత్తు ననఁగా నమ్మౌని యల్లన్వసి
ష్ఠసుబోధ న్ననుపుఁ డంప లక్ష్మణునితోడ న్రాముఁ డేతేరఁ దా
పసి శస్త్రాస్త్రము లిచ్చె వింటిపసఁ బోల్పన్నాక వా రున్నచోన్.
శా. ఘోరంబై చనుదెంచు తాటకికి నుగ్రంబై గురూక్తిన్ యమా
గారాతిథ్య మొసంగి తత్సుతుల వీఁకం దాకెఁ బాణద్వయి
న్మారీచుం డలదక్షిణాబ్ధిఁ బడియె న్మ్రందె న్సుబాహుండు నా
శ్రీరాముం డసమానుఁడై యజనమున్ జేయించె నమ్మౌనిచేన్.
మ. హరచాపోక్తిఁ దలంచి వేడ్క మిథిలాధ్యక్షుం గనంగోరి య
వ్వరమౌనీంద్రుఁడు రామలక్ష్మణులు గొల్వ న్వచ్చుచో రామపా
దరజస్స్పర్శనమాత్ర నాకశిల కాంతారూపముం గాంచె న
ప్పురి కమ్మువ్వురు నేగిన న్జనకుఁడు న్బూజించి విఖ్యాపినన్.
ఉ. గాధిజు కన్న సన్నఁ బురఘస్మరు విల్లిఱుగంగఁ జేసి ధా
త్రీధవు గౌరవంబుఁ గను శ్రీరఘురాముఁడు పెండ్లిపెద్దరై
భూధరమంతవాఁ డగుచుఁ బొంగుచుఁ బంక్తిరథుండు వచ్చె న
న్మైథిలి నూర్మిళాసతిని మాండవి నాశ్రుతకీర్తిఁ గన్యలన్.
శా. కల్యాణంబు లొనర్చె నప్డు జనకక్ష్మాభర్త వేర్వేఱుఁ గా
సల్యాపుత్త్రుని లక్ష్మణు న్భరతుని న్శత్రుఘ్నుఁ బూజించి త్వ
త్తుల్యా న్బాణిఁ బరిగ్రహింపు మని సంతోషంబుతోఁ శ్రీమతో
మాల్యాదుల్ మధుపర్కము ల్దగపి సన్మంత్రోక్త మారీతిగన్. 2

మ. అరణంబు ల్చతురంగవాహినులుఁ దా నల్లుండ్రకర్పించి భూ
సురవస్త్రాభరణాదులన్ దశరథక్షోణీశుఁ బూజించి స్వా
దరుఁడై కూఁతుల సారెవెట్టి యనిచెన్ దాసీజనం బిచ్చి సో
దరుఁడు న్గాంతలు వంత నొంద మిథిలాధ్యక్షుండు దీనాత్ముఁడై.

మ. జనకు న్మెచ్చి ప్రయాణమై దశరథక్ష్మాభర్త యేతెంచుచోఁ
గని శ్రీరాముని భార్గవుండు హరువి ల్ఖండించి గర్వింతె నా
ఘనచాపం బిదె వంపుమన్న నతఁ డుగ్రస్ఫూర్తి నీపుణ్యలో
కనికాయంబొ పదంబొ తున్మ నికఁ నికరం బీశరాగ్రం బనెన్.

మ. మది గుర్తించి నుతించి భార్గవుఁడు రామా కశ్యపాజ్ఞ న్భువి
న్బద మానం జన దద్రి కేగవలెఁ ద్వద్బాణాగ్ని మత్పుణ్యసం
పద కౌనా వుడు నట్లొనర్చెఁ దపము న్బ్రాపించె నాతండు స
ర్వదిశ ల్భోరనఁగా నయోధ్య విడిసె న్రాజేంద్రుఁ డత్యుద్ధతిన్.

ఉ. భూవిభుఁడగ్రసూనునకుఁ బొంగుచుఁ బట్టము గట్టనెంచుచో
భావి నెఱింగి లగ్న మొకభంగి వసిష్ఠుఁడు పెట్టె నంత వా
గ్దేవియు మంథరారసన దేవహితార్థము నిల్చె దాని బో
ధావశయైన కైక తనతాలిమి తూలఁగ భర్త కిట్లనున్. 14

ఉ. ఆహవభూమిఁ దేర్నడిపినప్పుడు రెండువరంబు లిచ్చి తీ
వీహిత మాచరింపుము మహీపతి మత్సుతుఁ జేసి రాము ని
ర్మోహుఁడవై యరణ్యమున ముచ్చటగాఁ బదునాలుగేండ్లిడ
న్సాహస మొప్పఁ గోరితిని సత్యవచోనిధివైన ని మ్మనెన్. 15

మ. వికటంబై హృదయంబు వ్రీలు పలు కుర్వీనాథు నొప్పించె మా
టకు మార్మాట వచింపలేక యతఁ డుండ న్రామచంద్రుండు జా

నకితో లక్ష్మణుతోఁ జనం దలఁచె భూనాథుండు సద్భూషణ.
ప్రికరంబుల్ వనముద్దుఁ గోడలికిఁ బంప న్భక్తితోఁ గైకొనెన్. 16

మ. అన్నయుఁ దమ్ముఁడు న్మునులయట్టుల నారలు గట్టి విండ్లతో
మన్నన సీతతో నడవిమార్గముఁ బట్టిరి నావ దాటిఁ పే
రెన్నికఁ గన్న సన్మునుల నెల్లరఁ గాంచుచుఁ జిత్రకూటముం
గన్న తెఱం గెఱింగి కనఁగా వడి నా భరతుండు వచ్చినన్ 1

చ. దశరథుచందము న్వినుచు ధర్మవిధు ల్నెఱవేర్చి పాదుక
ల్వశ మొనరింపఁ గైకొని తపంబునకై భరతుండు నేగ ది
గ్వశదయశుండు రాఘవుఁడు వేడుకఁ గట్టిన పర్ణశాలలో
శశిముఖి సేవ చేయ ననుజన్ముఁడు గొల్వఁగ నుండి నెండియున్ 1

సీ. కాకాసురుని గాచి కామించు శూర్పణ
ఖను దమ్ముచే భంగ మొనరిపించి
ఖరదూషణాది రాక్షసులను బదునాల్గు
వేల నొక్కరుఁడ నిల్చి లీలఁ దునిమి
మాయామృగముఁ ద్రుంచి మైథిలి న్వెదకుచు
నల జటాయువునకు నగ్నియిచ్చి
త్రోవ నడ్డినకబంధుని మోక్ష మొందించి
కూరిమి శబరివిం దారగించి
సీత సొమ్ములు పొడఁగాంచి చింతనొంద
ద్యుమణిసుతుఁ గాంచి సప్తతాళములఁ గూల్చి
వాలిఁ గూల్చి సుగ్రీవు భూపాలుఁ జేసి
భూమిసుత జాడ వినఁగోరె రామభద్ర.

శా. సుగ్రీవాజ్ఞ వనేచరు ల్వెదకి రాక్షోణీసుతార్థంబు స
ర్వగ్రామంబు లరణ్యము ల్గిరిగుహాప్రాంతంబులు న్వార్ధిలో-
జాగ్రన్నక్రగళవిగ్రహుండు హనుమజ్జంఘాలుఁ డబ్ధిందుర్న
త్యుగ్రుం డౌచు నతిక్రమించి కనె దైత్యోదగ్రలంకాపురిన్. 20

ఉ. నెమ్మది రామ-రామ యని నెవ్వగ నొందెడి సీత కెంతయు
న్నమ్మక మొప్పఁ బల్కి రఘునాథునిముద్రిక నిచ్చి మ్రొక్కి ర
త్నమ్ముఁ బరిగ్రహించి పరదానవనాథుని గాంచి లంకఁ బెం
దు మ్మొనరించి దాశరథితోఁ బవమానసుతుండు తెల్పినన్. 21

మ. రవిపుత్రాదులు గొల్వ రాఘవుఁడు సంగ్రామార్థమై వచ్చి యు
న్నవిధం బెంచి విభీషణుండు శరణన్న న్వాయుసూనుండు కా
వలె నా న్నైకొని వానరప్రభులచేవన్ వార్ధిఁ గట్టించి దా
నవలంకాపురిఁ జొచ్చి సంధి నడపెన్ న్యాయంబు దీపింపఁగన్.

ఉ. రాక్షసవర్యు లట్టితఱి రాఘవవీరులఁ దాఁకి యాజగ
ద్రక్షకు లేయు నాశుగపరంపరచే హతులైరి వానరు
ల్లక్షలుఁ గోటులై బ్రబలి లగ్గల కెక్కిరి కుంభకర్ణధూ
మ్రాక్షనికుంభ ముఖ్యులు సమగ్రబలంబుల తోడఁ ద్రెళ్ళినన్. 23

ఉ. ఇంద్రజిదాదివీరుల నహీనబలాఢ్యుల లక్ష్మణుండు ని
స్తంద్రయశుండు కూల్చుటయు దారుణరోష విషాదవేదనన్
సాంద్రవిభూతి రావణుఁడు సంగరరంగము నందు నిల్చె దే
వేంద్రవిమాన మెక్కి మనుజేశ్వరుఁ డత్తఱిఁ బోరె వీరుడై. 24

చ. నెఱవక బాహువు ల్తలలు విండ్లు శరమ్ములు సారెసారెకు
న్నఱకుచుఁ గ్రమ్మర న్మొలచిన న్వెగ డొంది విభీషణోక్తి ని

ర్తెఱఁగి పితామహాస్త్రము మహితనయాధిపుఁ డేసె నుగ్రతన్.
నెఱకులుఁ గాఁడి పాఱ నవనిం బడె రావణుఁ డద్రిపోలికన్. 25

మ. జయరామప్రభుఁ డవ్విభీషణుని రాజ్యప్రాప్తుఁ గావించి ని
ర్దయ చూప న్నిఖిఁ జంద్రుఁగా నెఱపె సీతాకాంత ముల్లోకము
ప్రియముం జెందఁ గుబేరపుష్పకము తీవి న్దీపితో నెక్కె స
ద్భయభక్తు ల్గలదానవు ల్గపులుఁ గొల్వ న్లక్ష్మణోపేతుఁడై. 26

సీ. రావణివైరి భారద్వాజు విందొందె
హనుమ నందిగ్రామ మనుగమించెఁ
బురము శృంగారింప భరతుఁ డుత్తరువిచ్చె
శత్రుఘ్నుఁ డలరుచు సంఘటించెఁ
బౌరబాంధవులు భూపాలుఁ దోడ్తెచ్చిరి
తల్లులు దీవించి ధన్యలైరి
సీతఁ గౌఁగిటఁ జేర్చి చెల్లెండ్రు చెలఁగిరి
పట్టణోత్సవ మంతఁ బ్రబలమయ్యె
జాంబవ న్ముఖానీత గంగాంబువులను
గొని వసిష్ఠాదు లభిషేకమును రచింప
ధర్మపత్నీ సమేతుఁడై తమ్ము లలర
రామభద్రుండు పట్టాభిరాముఁ డయ్యె. 2

# శ్రీ సతీకథామంజరి

## అంబరీషచరిత్రము.

---

క. శ్రీవనితాపతిభక్తిన్
శ్రీవిలసితుఁడగుచు నంబరీషుండు ధరి
త్రీవలయ మేలుచుండె ది
శావర్ణిత కీర్తిచంద్ర సదృశుండగుచున్.

సీ. నాభాగతనయుండు నయశాస్త్రమునఁ దండ్రి
తల మీఱె నను పెంపుకలిమిఁ గాంచి
పతి దైవముగఁ గొల్చు పరమ పతివ్రతా
మణి ధర్మపత్నియౌ యన్గణనఁ గాంచి
త్రేతాగ్నులను బోలెఁ దేజరిల్లెడి సుత
త్రితయంబు కల దంచు నుతులు గాంచి
యర్బుదషట్క మై యలరు గోధన మిచ్చి
సవనదీక్షల ద్విజస్తవముఁ గాంచి
సార్వభౌమాగ్రగణ్యప్రశస్తిఁ గాంచి
రాజయోగివరేణ్యుఁడై పూజఁ గాంచి
చిత్త మొక్కటగా శౌరిచింతఁ గాంచి
రక్తితో నంబరీషుండు భక్తిఁ గాంచె.

క. ధర్మానుష్ఠానమునకు
నిర్మలకీర్తికిని యోగనిష్ఠాదులకున్
భర్మాంబరుఁ డెద మెచ్చుచు
నర్మిలిఁ జక్రాయుధంబు నతనికి నొసఁగెన్. 3

చ. కుతుకము మీఱ నేఁడు మఱికొన్ని దినంబులు పోవ సన్ముని
వ్రతతి ననుజ్ఞ వేఁడి కులభామ సపర్య లొనర్చి కొల్వఁగా
నతులితభక్తిలో నుడుగ నార్చిత మైతగునట్టి ద్వాదశీ
వ్రత మొనరింపఁ గోరుటయు వచ్చెను గార్తికశుక్లపక్షమున్. 4

సీ. ఏనాఁడు శ్రీకృష్ణుఁ డిచ్ఛానుసారియై
పాలికడలి నిద్ర మేలుకాంచు
నేనాఁడు లోకంబు లేలుతలంపుతో
శ్రీలక్ష్మిపతి గొల్చి లీల వచ్చు
నేనాఁడు బృందావనేందిరామణి హర్ష
పూరితచిత్తయై పేరుఁ గాంచు
నేనాఁడు బ్రహ్మాదు లెల్లరు భూలోక
గతుఁ డైనహరిని సంస్తుతు లొనర్తు
రట్టి కార్తికైకాదశి నాదియామ
మందుఁ బత్నియుతుండు కాళిందిఁ గ్రుంకి
మధువనంబున నేఁడు రమాధవునకుఁ
జేసెను మహాభిషేకంబు వాసి మీఱ. 5

శా. సంకల్పించెను ద్వాదశీవ్రతము విష్వక్సేను నర్చించి ని
శ్శంకన్ బ్రాహ్మణపూజయుం జలిపి హర్షస్వాంతుఁ డేకాదశిం

బంకేజోదరుఁ గూర్చి జాగరణము న్భక్తి న్సమర్థించె న
య్యోంకారాత్మకుఁ దత్త్వవేది యగునయ్యుర్వీశుఁ డుత్సాంగుచున్

శా. క్షీరాన్నంబును జున్ను మేల్మి ఫలము ల్చిత్రాన్నము న్పెర్గు పా
ల్పూరీ ల్పూరణభక్ష్యముల్ ఘృతనదుల్ పొంగారు శాల్యన్నము
న్నీరంబు ల్మఱునాఁటి యుపకడఁ బేర్మి న్విప్రసంతర్పణం
దోరం బై కనుపట్ట ద్వాదశిని సంతోషంబు దీపింపఁగన్. 7

శా. ఉర్వీజానియుఁ బారణం బలుపఁగా నుద్యుక్తుఁడై యున్నెడం
దుర్వాసుండు భుజింప వత్తు నని తోడ్తో నేగె స్నానంబుకై
యుర్వీదేవునిరాకఁ గోరుచు నృపుం డుండె న్భయోత్కంఠుఁడై
సర్వంబు న్జనఁజొచ్చె ద్వాదశి మనస్సంకోచ మబ్బె న్మదిన్. 8

శా. ఓహో, పండితులార! శాస్త్రనియమం బూహింపుఁడీ ద్వాదశి
న్బాహాటం బగుపారణావిధికి విప్రస్వామి కోపించి నన్
ద్రోహీ యంచు శపించు మానిన వ్రతద్రోహం బగున్ ధర్మసం
దేహంబు న్విడఁదీసి తెల్పుఁ డని ధాత్రీభర్త ప్రార్థించినన్. 9

కం. అప్పుడు విద్వన్నికరము
చెప్పెను శ్రీపాదతీర్థసేవను దోషం
బుప్పతిల దనుచు నృపుఁ డా
చొప్పు న్భజియించెఁ దాపసుండు న్వచ్చెన్. 10

చ. అతిథిని గాంచి లేచి వినయంబున మ్రొక్కెడు నంబరీషుపై
హుతవహునట్లు మండిపడి హుంకృతితోఁ గను లెఱ్ఱచేసి నీ
వ్రత మన నెంత న న్బిలిచి వంచన నెంగిలికూడు పెట్టెదే
హత మొనరింతు నిన్నని దురాగ్రహుఁడై ముని భీకరాకృతిన్. 11

శా. కాలాహిప్రభ లీను పెంజడ దిశ ల్గంపింప దోశ్శక్తితో
నేల న్గొట్టిన నార్పు పెల్లు లొదవ న్నింగి న్వడంపెంచుచు
న్కాలోగ్రాయుధహస్త కృత్య యొదురై శుంభద్గతిం దాఁకె ధ
ర్మాలానంబునఁ గట్టువడ్డగజ మయ్యె న్నేఁడు శాంతాత్ముఁడై. 12

మ. హరియాజ్ఞ న్వరచక్రరాజము మహాహంకారకృత్య న్వెసం
దఱిగ న్మోపముఁ జక్కఁ జేసి మఱియు న్దగ్ధంబుఁ గావించెఁ దృ
ప్తి రవం తేనియు లేక యమ్మునివరు న్వేధింపఁగా నెంచుచు
న్నుఱుమాడ న్జెలరేఁగి వెంటఁ బడిన న్గాంచె న్మునీంద్రుం డెదన్.

శా. సక్రోధోన్నత వహ్నికీల లెగయ న్సర్వంకష ప్రజ్ఞతోఁ
జక్రం బప్డు డనేకచిత్రగతుల న్సంచారముం జేయుచు
న్వక్రోక్తు ల్గలమౌనిపుంగవుని గర్వం బొల్లఁబోవ న్దిశా
చక్రం బెల్ల వడంకఁజేసె సుర లాశ్చర్యంబునం జూడఁగన్. 14

మ. కలఁగం బాఱును దాఱు జిచ్చవడు న్మై కంపించు వెన్వెనకన్ రై
నిలుచుం బోరఁ దలఁచు నొంచు ననుచు న్నిర్భిన్నచిత్తంబులోఁ
దల పంకించును దాళఁజాలనను నాతప్పేమి రక్షింప నీ
యిలపై నెవ్వరు లేరె యంచు ముని పెల్లేడ్చు న్దెసల్ జూచుచున్.

క. ఈతాపము సైరింపఁగ
నేతీరున నేర్తు నంచు నిలఁ గాలూన
న్భీతిఁ గొని డాఁగఁ జనె ముని
పాతాళంబునకు వెంటఁ బడెఁ జక్రంబున్. 16

మ. వెనుకం జూచి దిగు ల్గడలొత్తఁగ విన్వీధి న్వెస న్బాఱి య
మ్మని దేవేశ్వర కావవే యనినఁ జేమోడ్చు న్సమర్పించి నే

ననఁగా నెంత సుదర్శనంబునకు మా ఱాఁడ న్సమర్థుండనే
యనిన న్బ్రహ్మపురంబుఁ జేరఁ జని నెయ్యం బొప్పఁగా న్నిట్లనున్.

మ. అనలార్చుల్వెదచల్లెఁ జక్ర మికటా యబ్జోద్భవా సత్కృపన్
మనుపం జిత్తములోఁ దలంపఁగదవే మన్నింప రావే యన
న్ననుఁ బుట్టించినవానిమాటఁ గడన న్నా చేతఁ గా దంచుఁ బ
ల్కినఁ గైలాసనగంబుఁ జేరి ముని భక్తిం గాంచె సర్వేశ్వరున్. 18

శా. సర్వంబు న్గరుఁడుండు వోలె నను నీచక్రంబు గారించుచుం
గార్పణ్యంబున వచ్చుచున్న యది సత్కారుణ్యరత్నాకరా
యూర్పన న్విడనీక మంట లిడె నయ్యో ప్రాణము న్నిల్పరా
కర్పూరాధిక కీర్తి భాస్వర ! యన న్గంజోదరాప్తుం డనున్. 19

శా. ఈచక్రంబు త్రిశూల మేనును రమాధీశుండు శక్తిద్వయి
న్భూచక్రావనతత్పరత్వమున సంభూతంబులం జేయఁగా
వీచీలాస్యజలోరుదేశమ్మున నవ్విష్ణ్వాయుధం బత్తఱి
న్నాచేఁ జిక్కె మదాయుధంబు చనియె న్నారాయణుం జేరఁగన్.

క. విను మచ్ఛక్తి జనించియు,
జనార్దనాధీన మగుటఁ జక్రము శాంతిం
గానఁ ద్వైకుంఠుని గా
ల్వ నేగు మనె శూలి ముని కలంగుచుఁ జనియెన్. 21

మ. కని తత్పాదతలంబున న్బడి జగత్కల్యాణ సంపత్కరా
మును నీభక్తుని దూఱి దానికి ఫలమ్ముం గంటి నే నయ్యయో
తనువెల్ల న్నడఁకంగఁ జొచ్చె నకటా తాపంబు నొందించె నీ
ఘనచక్రాగ్ని మరల్పవే యనిన భక్తశ్రీకరుం డిట్లనున్. 22

ఉ. పుత్రయుతుండు బంధు జనపూజ్యుఁడు బ్రాహ్మణభక్తుఁ డుత్తమ
క్షత్రియుఁ డార్యసమ్మతుఁడు శాత్రవకుంజర సింహమూర్తి తా
పత్రయదూరుఁ డాదిజనపాలచరిత్రుఁడు తత్త్వవేది స
త్పాత్రుఁడు సత్కళత్రుఁడు నపాత్రుఁడె నీకు వధింప నర్హుఁడే? 23

క. బ్రతుకు వలతేని సత్వ
స్థితిం బ్రబలు నంబరీషు శ్రీసత్కరుణ
న్నుతిఁ జేయ నేగు మనె హరి
యతండుఁ జనుదెంచి దీనుఁడై భూస్థలికిన్. 24

మ. అనలజ్వాలలతో వడిం దఱుముచుం బైవచ్చు చక్రంబుతోఁ
బెనుబాముల్వడి శోష లుప్ప తిలఁ బ్రస్వేదాంకుర శ్రేణితో
ననయంబున్ మదిలేని త్రిప్పటను వ్రయ్యల్వారునెమ్మేనుతో
ముని మ్రొక్కన్ గని యంబరీషుఁడు కరంబు ల్వోడ్చె షద్భక్తుఁడై.

చ. హరిని భజింతు నేని యనృతాదరణంబు, నెఱుంగనేని భూ
సురులను, గొల్తు నేని మధుసూదనచక్రము విప్రరక్షకై
కరుణ వహించుఁగాక యనెఁ గ్రక్కున శాంతిఁ గనె న్సుదర్శనం
బరుదుగ నంబరీషుఁ గొనియాడె మునీంద్రుఁడు హర్షచిత్తుఁడై. 26

క. కార్తిక శుక్లద్వాదశి
మూర్తీభావంబు నొందెఁ బూర్ణవ్రతుఁడై
కీర్తిఖని యతిథిపూజ
న్వర్తించి భుజించి విష్ణుభక్తిఁ జెలంగెన్. 27

# శ్రీ సత్రధామజ్ఞారి

## గజేంద్ర చరిత్రము.



క. శ్రీనారాయణ భక్తి
ధ్యానపరావశాత్ముఁ డైనద్రవిడేశ్వరునిన్
గానఁ జని యగస్త్యుఁడు స
న్మాన మొనర్పమికిఁ గనలి మత్సరమతియై.

శా. ఔరా రాజ్యమదాంధకారగరిమం బత్యద్భుతం బయ్యె ని
ద్రారాజన్ముఖు నట్లు మ మ్మెఱుఁగ వింద్రద్యుమ్న భూపాల ఘో
రారణ్యోగ్ర విహారమత్త గజ దేహప్రాప్తిచే విప్రవా
క్సారంబుం జవి గాంతుగా కని యథేచ్ఛ న్మౌని పోయె న్వెసన్.

ఉ. కన్నులు విప్పి నట్లెనలుఁ గన్గొని సంయమి కన్నెఱింగ నం
చన్నర నాథమౌళి వినయంబు భయంబుఁ బెనంగొనంగ ము
న్నెన్న తెఱంగున న్సుభటవీరులతో నృపకోటితోఁ ద్రికూ
టోన్నత పర్వతాగ్రముల నుత్తమజాతిగజప్రసూతుఁ డై.

సీ. నును పైనముద్దుమేను నాధారముగఁ దాల్చి
పుడమిపైఁ గాల్మోపి నడువ నేర్చె
లేఁతతుండము చాఁచ లేఁగొమ్మ లాకకొన్ని
విఱిచి నములునట్టి వెరవు నేర్చె

గుజ్జుమావులక్రింద గున్నయేనుఁగులతోఁ
గ్రొత్తయాటల నాడుకొనఁగ నేర్చెఁ
గొలఁకుల నీ రెల్లఁ గలఁకలు గావించి
తమ్మితూండ్లు పెకల్చుతలఁపు నేర్చెఁ
గొండలకుఁ బ్రాఁకి తిరుగాడుకోర్కె నేర్చె
జంతువులఁ జీల్చి చెండాడుసరణి నేర్చె
మ్రాకు లెల్లను జెలరేఁగి మట్ట నేర్చె
సొగసులకు మిన్న యాముటేనుఁగులగున్న. 4

శా. మోదార్హం బగుబాల్య మిట్లు జరుగన్ భోగార్హమౌ యౌవన
ప్రాదుర్భావము నొంది హస్తిచయ సామ్రాజ్యాభిషేకోత్సవం
బై దిగ్దేశగజేంద్రులన్ గెలిచి ప్రఖ్యాతి న్గజేంద్రాఖ్య సం
పాదించె న్విహరించె నక్కరి జలప్రాంతోరు కాంతారముల్. 5

మ. దశకోటిద్విపసేవ్యుఁ డౌచును గజేంద్రస్వామి భూమీధ్రతా
దృశధైర్యుం డలబంభరాతిథిగణప్రీత్యర్థదానాంబుసి
క్తశరీరోరు సుగంధలిప్తనవ శృంగారాఢ్య దిగ్భామినీ
విశదప్రాభవ మొప్ప స్వైరి వెడలెన్ భీమాటవీ సీమలన్. 6

ఉ. వెక్కస మైనచీఁకటుల వెల్లిఁ గనుంగొనుఁ డంచుఁ గావుకా
వక్కట కొండ లెల్ల గుమి యై నివసించెను జూడుఁ డంచుఁ గా
వెక్కడి మేఘమాలిక లహీనగతి న్భువిఁ బ్రాఁకె నంచుఁ గా
వక్కరియూథ మంచును సురావళి కాంచుఁ గ్రమక్రమంబుగన్. 7

శా. వీరాకారముఁ దాల్చి మత్తగజము ల్విస్వీథి నీక్షించి ఘీం
కారంబు ల్పచరించునప్పుడు భయక్రాంతంబులై గహ్వర

ద్వారవాంతము లోకభూపెట్ట మొరయ న్వారాహశార్దూలజి
ద్భేరుండోరగ సింహరాజచమరీబృందంబు బిట్టులెక్కదున్.

క. వనఖేల నావివశతన్
వనేభసాంద్రమాట్టు తోవఁ బాసి పిపాస
న్వనగజములతో సరసీ
వనంబునకు వెడలెఁ బుడమి వడఁక న్నడఁకన్. 9

చ. కనె గజరాజు నవ్యశుభ కాంచన పద్మసుగంధ గౌరవం
బును మధుప ప్రమోదపరిపూరిత గాన విలాసమేదురం
బును గలహంసికానికర భాసిత నాట్యకలాపబంధురం
బును హృదయప్రియంబు ననయంబు నొసంగుసరోవరం బటన్

పెన్నిధిఁ గన్న పేదవలెఁ బ్రీతి సరస్సున నీఁదులాడుచు
న్మన్నన నీరుఁ గ్రోలి కరమండలిఁ బీలిచి చల్లులాడుచుం
గొన్ని సరోజనాళము లకుంఠితలీలఁ బెకల్చి వైచుచుం
జె న్నలరార నాడె నలసింధురరాజు కరేణుపఙ్క్తితోన్. 11

నీరం బెల్లఁ గలంచుట న్సరసిలో నిద్రించునక్రంబు దు
ర్వారక్రోధవిఘూర్ణమాన యగుచు న్వాలంబు నల్లార్చుచుం
గ్రూరోగ్రానలకీల లుప్పతిల దిక్కు ల్గంప మొంద న్మహా
ధీరుం డైనకరీంద్రుపూర్వపద మర్థి న్బట్టె దంష్ట్రాళిచేన్. 12

ఇటు నటుఁ జూచి కొంకక మదేభము గ్రాహముగా నెఱింగి హృ
త్పుట మవియంగ నేయుటయు ముందటిపట్టు నొకింత వీడఁ ద
త్తటమున కీడ్చె నమ్మొసలి దారుణభంగి మరల్చె దిక్కరుం
లటుకట నొంది చెచ్చవడఁగా దుర మద్భుత మయ్యె నత్తఱిన్.

క. జలచరవనేచరంబులు
తొలంగక గ్రాహంబు లనికిఁ దొడరినభంగిన్
నిలిచి చలింపక బిరుసై
బలిష్ఠత నెమ్మఱసె నుగ్రభండన పరతన్. 14

చ. గుభగుభనాద ముప్పతిలఁ గ్రూరవిషార్చులు మింట నంటఁగా
నభమునఁ బక్షులు న్బెదరి నల్దడల న్పరువెత్తునట్లుగా
నిభములు తల్లడిల్లఁగ నహీనరణోత్సవ ముల్లసిల్లఁగా
రభస మెలర్ప నమ్మొసలి రౌద్రవిలాస మొనర్చె నత్తఱిన్. 15

శా. నిర్వేదం బొదవం గరేణువులు దుర్నీతాత్మ ఖండింపఁగా
నుర్వీజప్రతతుల్ వికల్పి యుడ నత్యుత్సాహియై హస్తస
ద్గర్వాఖర్వపరాక్రమోగ్రుఁ డగుచున్ గ్రాహంబు నో నేసె న
య్యుర్వీజావళి చూర్ణమై చనెఁ దదీయోగ్రాసిహాలోద్ధతిన్. 16

మ. మఱియు న్బోరిరి నిప్పుక ల్గురియ సామర్థ్యంబు లుప్పొంగఁ గ్రి
క్కిఱియం గాటు లొడళ్ళఁ దూళ నమరు ల్గీర్తింప నశ్రాంతముఁ
దఱుమై వాలకరప్రహారములు చిత్తస్థైర్య మూటాడఁగా
నెఱకు ల్గాఁడఁగ నక్రనాగములు నిర్నిద్రస్పృహాస్రాబ్దముల్. 17

చ. సలిలనివాస మౌ మొసలి సత్వసమగ్రతఁ గాంచి మించె భూ
స్థలి విహరించుచుం బ్రబలు సామజరాజము మేఁత లేక బి
ట్టలమట నొంది డిందుపడి హా నన్నుఁ బ్రోవ సమర్థు లెవ్వరో
బలము చలంబుఁ బ్రాణములుఁ బాయునొకో యనుభీతి నిట్లనున్.

మ. అకటా పట్టును వీడ దొల్లదు మదీయాభీలయుద్ధంబుచే
నొకవేళ న్విడెనో మఱింతవడిగా నుంకించిపట్టుం గరో

రకరాశావృత దంత ఘట్టనము నోర్వ న్వచ్చునే శ్రీహరీ
వికట గ్రాహమదోద్ధతి న్దనుమవే వీక్షించి రక్షింపవే. 19

శా. రక్తస్రావముచే బలం బెడలె నుగ్రగ్రాహ దంష్ట్రాళి ని
ర్ముక్తింగాంచు టిఁ కెన్నఁడో యెగయఁజిమ్ము న్జీల్చి చెండాడు నా
శక్తి న్వమ్మొనరించు నాంచు నకటా సర్వేశ్వరా కావరా
భక్తారాధన తత్పరా శరణు మద్బాధ న్నివారింపరా. 20

మ. చెదరెన్ హృద్గతధైర్యసంపద నశించెం దాల్మి పెన్భీతిచే
బదము ల్ట్రొటిలఁ జొచ్చె నంగములు నొవ్వ న్సాగెడున్ దప్పి బి
ట్టొదవు న్బాధల కోర్వఁజాల నిఁక నయ్యో దిక్కు నీవే కదే
గదతోడ న్మొసలి న్వధింపఁ గదవే కావంగదే రాఁగదే. 21

శా. ఈపాపం డిఁక నోర్వఁజాలఁ డని నీకెవ్వారలుం దెల్పరో
కోపాడంగఁ దలంపు లేక యకటా కారుణ్యముం జూపవో
నాపాపంబు ఫలించి నీమనసులోన న్నాటవో నామొఱల్
కోపంబో తలపోయఁజాల నిఁక నయ్యో ప్రాణము ల్నిల్పవే. 22

మ. అదె మ్రోసె న్వరపాంచజన్య మని యత్యాసక్తి నాలించు న
ల్లదె దేవావళి గొల్వ వచ్చె నని దివ్యానందముం జెందు న
ల్లదె పక్షీంద్రవిమానరాజ మని పేరాస న్నిరూపించు న
ల్లదె వీతెంచుచు నుండె విష్ణుఁ డని నెయ్యం బొప్ప వీక్షించుచున్.

శా. అమ్ముగ్ధుం డెటు దిక్కుఁ గానక మొఱో యంచు న్విలాపించు నా
దమ్మున్ శ్రీహరి యాలకించి దృఢచిత్తుం బుత్తలం బొందఁ జ
క్ర మ్మేనిం గొను వేళ లేక తనప్రక్కన్ లక్ష్మి నూత్నోత్తరీ
యమ్ము న్వీడక యేగుచుండె సతి చేలాకర్షణన్ దోడరాన్. 24

చ. హరి యిటు లేగుచుండుటయు నద్భుత మొందుచు దేవతాళి త
త్వరికరమ్ము ల్వెస న్గొనుచు భక్తిమెయిం జనుదేర దుఃఖని
ర్భరహృదయంబు గల్గు నలభద్రిగజంబును బ్రోవ నెంచి ని
ష్ఠురతర ఘోరనక్రముకరోరత మాన్ప సరస్తటి న్గనెన్. 25

ఉ. భీకర మైనచక్రము గుభిల్లున నీరము సొచ్చి గ్రాహము
న్నీఁక నదల్చి తచ్ఛిరము వ్రేటుగొనె న్జయశంఖ మొత్తి ల
క్ష్మీకరుఁ డగ్గజేంద్రుని స్పృశించుట నెప్పటిభాతిఁ నొంది దే
వా కరుణానిధీ యనుచు భక్తి నుతించెను బంధుయుక్తుఁడై. 26

శా. గ్రాహం బప్పటిమేను వీడి నిజశృంగారంబుతో భక్తితో
నూహూనామకుఁడై హరి న్బొగడుచో నుప్పొంగి దేవౌఘ మో
హో హో దేవలశాపమోక్షణమె నా నొప్పె న్మహావిష్ణువు
న్మాహాత్మ్యం బిటు చూపి కన్మఱుఁగ బ్రహ్మానందసంధాయియై. 27

# శ్రీసత్రాధామజ్ఞరి.

## మార్కండేయ చరిత్ర.

క. శ్రీశంకరు నదితికుమా
రేశనుతు న్వారణాశి యేగి మృకండుం
డాశించి కొలువఁ దృప్తుం
డై శంభుం డేగుదెంచి యమ్ముని కనియెన్. 1

మ. ముద మొప్పం జిరజీవి మూర్ఖతముఁ డౌపుత్త్రుం గనం గోరెదో
పది యా ఱేండ్లతనూజు సర్వసుగుణప్రఖ్యాతు వాంఛించెదో
యెది నీయిష్ట మనన్ మృకండుముని సర్వేశు న్గుణాపూర్ణుఁ డౌ
పది యా ఱేండ్లకుమారుఁ గోరికొని సద్భక్తిం జనె న్వీటికిన్. 2

గీ. గర్భవతి యై మరుద్వతీకాంత మంచి
లగ్నమునఁ బుత్త్రకుని గాంచె లక్షణాఢ్యు
వ్యాసఋషి నామకరణంబుఁ జేసె మాను
తెలమి మీఱ మార్కండేయుఁ డితఁ డనఁగ. 3

ఉ. నారదుఁ డేగుదెంచిన మనం బలర న్మునిపుత్త్రుఁ జూపఁ బె
న్గారవ మొప్ప నెత్తికొని కాంచి చిరాయు రుపేత రూప రే
ఖారమణీయుఁ డౌటను మృకండున కత్తెఱఁ గెల్లఁ జెప్పి గౌ
రీరమణాజ్ఞయుం దలఁచి ప్రీతిఁ జనె న్మునిపూజ లందుచున్. 4

క. అన్నప్రాశనచౌలము
లున్నతి నొనరించి పిదప నుపనయనాదుల్
మన్నన విద్యాభ్యాసము
గన్నకుమారునకు నమ్మృకండుఁ డొనర్చెన్. 5

ఉ. వేదవిదుల్మహాత్ములు వివేకధనుల్చనుదెంచు వేళఁ ద
త్పాదయుగప్రణామమును భక్తి నొనర్పఁగఁ బంచెఁ బుత్రకున్
సాదరులై తాము దీవన లొసంగుచు నేగెద రెల్ల రట్టిచో
నారదమౌనిసప్తకము నచ్చటికిం జనుదెంచె నర్మిలిన్. 6

శా. అమ్మౌనీంద్రుఁడు భక్తిపూర్వకముగా నర్చించె వారి న్సుతుం
డమ్మై మ్రొక్కెను మౌను లాయువరను దీర్ఘాయుష్యమస్తంచుఁ బ్రే
మమ్మం జూప వశిష్ఠుఁ డర్పఁ గొనమిం బ్రశ్నార్థుఁడై శూలివా
క్యమ్మాశీస్సునకు న్విరోధమని నెయ్యమ్మొప్ప వాక్రుచ్చినన్.

క. ఆకారణం బెఱుంగుట
నాకశ్యపముఖ్యు లప్పు డన్యోన్యముఖా
లోకనములతో నన్నృతపు
వాకులు పలికితి మటంచు వాంచిరి శిరముల్

ఉ. అత్తెఱఁ గెల్ల గాంచుచు రయంబునఁ బల్కె వశిష్ఠమౌని యో
రిత్తవిచార మేటికి విరించికిఁ దెల్పుద మంచు మౌను ల
య్యుత్తమబాలకున్ సరసిజోద్భవుసత్సభ మ్రొక్కఁ బంపఁ దాఁ
జిత్త మెలర్ప నిచ్చెఁ జిరజీవివి కమ్మని బ్రహ్మ దీవెనన్.

మ. కని బ్రహ్మణ్యులు కశ్యపాదులు శిరఃకంపంబు గావింప స
ద్వినయప్రాంజలులై వశిష్ఠముని యావిప్రాత్మజున్ షోడశా

బ్జనివిష్టాయువుఁ జేసె శూలి యిడె దేవజ్యేష్ఠ దీర్ఘాయుర
ర్థని నార్యోర్వరు మాను లీవు నన నయ్యబ్జోద్భవుం డిట్లనున్.

ఉ. తప్పునె బ్రహ్మవాక్యము యథార్థ మటంచును బల్కు వేదముల్ 10
దప్పునె యాదిమానివిదితం బగుసూనృతవాక్యగౌరవం
బిప్పుడు జీవకోటి సృజియించుతలంపునఁ జేసి శూలికిం
దప్పు ఘటించినాఁడ నని తత్పదయుగ్మము నాశ్రయించెదన్.

క. అని మార్కండేయకుమా 11
రుని గౌఁగిటఁ జేర్చి శంకరుం బ్రార్థింపం
జను మని మూర్ధాఘ్రాణం
బొనరిచి విధి యంపెఁ దండ్రి యున్నెడ కతనిన్.

మ. జనకుం గన్గొని భక్తియుక్తుఁడయి సాష్టాంగంబు గా మ్రొక్కినం 12
దనయుం గౌఁగిటఁ జేర్చి ముద్దుఁగొను మూర్ధాఘ్రాణముల్ చేయు నేఁ
డనుచున్ దీవెన లిత్తురా యనును విద్యాసాగరుం డైతివే
యను నానోములపంట రావె యను నత్యంతార్తి మౌనీంద్రుఁడున్.

శా. లోకస్తుత్యులు మీరె ధైర్య మెడలన్ లోలాత్ములౌటే లొకో
శోకవ్యాకులచిత్తయై జనని యిచ్చో నార్తయౌటే లొకో
నాకుం దెల్పు మటన్న మాని పలుకన్ నాపాప మిట్లుండె దం
డ్రీ, కన్నారఁగ నిన్నుఁ గానక యేరీతిం బ్రవర్తింతురా.

క. అని తత్కథ వివరించిన 14
విని మార్కండేయుఁ డాత్మ వెఱువకఁ దండ్రిం
గని చంద్రజూటుఁ గొల్చెద
ననుజ్ఞ దయచేయు మనిన నతఁ డిట్లనియెన్. 15

సీ. తండ్రి నీ వుదయించుతఱిని వ్యాసుఁడు వచ్చి
నామకరణ మిచ్చి ప్రేమ జూపెఁ
బిదప స్వాము ద్రికవేత్త రై పూర్ణాయు
వును గాంతు వని దేవముని వచించెఁ
దరువాత యోగవిద్యాపారగులు విప్రు
లెల్లరు దీవించి రుల్ల మలరఁ
మఱియు సప్తర్షిసన్మానితుఁ డై పద్మ
జుఁడు నాత్మ నాయువు నిడ దలంచెఁ
నీశ్వరుని భక్తి చేయ నీ కిచ్చు నాడ మెఁ
గౌతమీతీర్థ మభిమతప్రీతికరము
చేయుము తపంబు నిష్టార్థసిద్ధిఁ గోరి
యనుచు నావురుమనె మౌని తనయుఁ గాంచి. 16

ఉ. అగ్గల మైనశోకమున నమ్మునిపత్నియుఁ దాను పుత్రకుఁ
డగ్గఱి కౌఁగలించి యకటా నినుఁ బాసి భరించు టెట్లొకో
యగ్గిరిజేశుసత్కరుణ నంది మముం గనవచ్చు టెన్నఁడో
యొగ్గతి నోర్చువారము మహీస్థలి నంచుఁ గలంగి రత్తఱిన్. 17

ఉ. తల్లికిఁ దండ్రికిన్ దగువిధంబున ధైర్యముఁ జెప్పి పుత్రకుం
డెల్లరు మెచ్చ గౌతమికి నేగి జలంబుల నాడి వేడ్క భా
సిల్ల శివప్రతిష్ట నటఁ జేసి త్రికాలములందు భక్తిను
త్పుల్లసరోజపత్రములఁ బూజ నొనర్చె నభీష్టసిద్ధికై. 1

క. కాలం బాసన్న మగుట
కైలాసనగంబునకు మృకండుసుతునకై

ఫాలాక్షుఁ గాంచ నేగి కృ
పాలోలుఁ డైనబ్రహ్మ ప్రస్తుతిజేసెన్. 19

ఉ. దానికి మెచ్చి యీశ్వరుఁడు తామరచూలికి ధైర్య మిచ్చి స
న్మానపుదృష్టితో ననిచె మానికుమారునిగండమాటచేఁ
దానె చనెన్ యముండు నుచితస్థితిమీఱఁ బ్రభాతపూజలన్
భానుతనిశ్చలత్వమునఁ బొల్చెఁ గుమారుఁడు భక్తియుక్తుఁడై. 20

మ. కని ధర్మప్రభుఁ డవ్వికారరహితుం గాలంబు నాసన్న మౌ
య్యెను రమ్మంచును బిల్వ నర్భకుఁడు సర్వేశార్చనాబుద్ధితో.
విన నట్లూరక యుండెగాలుఁ డను నోవిప్రాత్మజా పూజ చా
లును రారమ్మనె బాలుఁ డీశ్వర! దయాళూ!! యంచుఁ బ్రార్థింపగన్.

చ. పెడచెవిఁ బెట్టిదే పలుకుభీతి జనించెనె కాల మైనచో
గడువఁగ వచ్చునే విధిని గ్రుక్కునఁ బట్టెదఁ గాక నిన్నుఁ బో
విడతునె యీశ్వరార్చనము వేగ విసర్జనఁ జేయుమంచుఁ జే
రడలు జనింపఁ జేయుప్రళయాంతకుతో మునిపుత్రుఁ డిట్లనున్.

ఈచంద్రార్ధమకుటపూ
జాచరణ మొనర్చునన్ను నవమతిఁ బట్టన్
నీచేత నగునె యనుచున్
వాచాగాంభీర్యసరణి వాకృచ్చుటయున్. 23

పెటపెట పండ్లు గీటి తనభీకరరూపముఁ బెంచి యష్టది
క్తటములు కంప మొంద ఘనదండము పాశము చేత నమర్చి నిం.
దృటి నుపసంహరించెద మదించితె యంచుఁ గరాళవక్త్రుఁడై
యట నిలువన్ భయం బొదువ నర్భకుఁ డిట్లనివేడె నీశ్వరున్

ఉ. ఓకరుణాకరా! విడువ నోపను ద్వచ్చరణద్వయార్చనన్
భీకరపాశహస్తుఁడు వివేకవిదూరుఁ డదల్పఁ జొచ్చెడున్
హా కడలేనిదుఃఖముల నందెదరో తలిదండ్రు లీశ్వరా!
సాకవె యంచుఁ బాలకుఁడు చక్కఁగఁ గౌఁగిటఁ జేర్చె శ్రీశివున్.

శా. దీక్షన్ సర్వయుగాంతకుండు ప్రళయోద్దీప్తార్కచండంబునన్
దక్షత్వంబునఁ గాలపాశ మిడి నిర్దాక్షిణ్యుఁడై యర్భకున్
దక్షద్వేషయుతంబుగా దిగిచినన్ దర్పోజ్జ్వలాకారుఁడై
వక్షఃపాటన మాచరించె శివుఁ డవ్వైవశ్వతుం డీల్గఁగన్. 26

సీ. సురదుందుభులు మ్రోయ సుమములు వర్షింప
నమరలోకస్తుతుల్ తుముల మయ్యె
నపుడు మార్కండేయుఁ డంజలిబద్ధుఁడై
పరమేశు వినుతించి వరము వేఁడె
సప్తకల్పాయుఃప్రశస్తి శంకరుఁ డిచ్చె
బ్రహ్మర్షిపట్టంబు బ్రహ్మ కేతనఁ
మునిసుతుం డాశ్రమంబునఁ దల్లిదండ్రులఁ
గని మ్రొక్కి సంతోషవనధిఁ దేల్చె

గీ. నుర్వికెక్కె యముఁ బ్రోచె మృత్యుంజయుండు
ధీనుతుండు మార్కండేయమౌనివరుఁడు
పితృహితుఁడు సత్యసంధుండు వేదరతుఁడు
లోకవినుతమహర్షిసుశ్లోకుఁ డయ్యె. 27

# శ్రీసత్కథామఞ్జరి.

## కుచేలచరిత్రము.

క. శ్రీరామకృష్ణసఖుఁడై
నేరిచె సాందీపు నొద్ద నిఖిలాగమముల్
ధీరుఁడు కుచేల విప్రుఁడు
దారుఁడు గురుతుల్యుఁ డిల సుదామఖ్యాతిన్. 1

మ. తన పెద్దల్గడియించు మాన్యముల విత్తంబు న్మహామేరువుం
గని నల్పెంచి కుటుంబరక్షణ నొగి న్గావించువాఁ డెన్నఁడున్
ధనకాంక్షం బరు వేఁడఁబోక నిజవిద్యాగౌరవం బొప్ప స
జ్జను లెల్ల న్వినుతింప సద్గుణగణైశ్వర్యోన్నతిం జేకొనెన్. 2

శా. ప్రాతఃస్నానము సంధ్యయుం జపము నిర్వర్తించి హృద్వీధి స
ర్వాతీతుం బరమేశ్వరుం బరము సర్వాధారభూతుం జగ
న్నేతన్ శ్రీరమణీమనోరమణు నన్నీలాంబరుం గొల్చుచుం
బ్రీతిం ధర్మసతీలలామ గొలువం బెంపొందె నాతం డిలన్. 3

ఆత్మజు లష్టపుత్రధనమస్తను పల్క నతిక్రమించి శాం
తాత్మున కిర్వదొక్కరు జయంతసముల్జనియించి సర్వజీ
వాత్మకుఁడైనశౌరికృప నంచితలీలల నొప్పుచుండి ర
ధ్యాత్మవిదుం డతండును బ్రియంబునఁ బెంచుచునుండె వారలన్.
ముచ్చట బాలకు లక్కునులముందట నాడుచుఁ దల్లిచెంతకున్
వచ్చిన సరితసం బొదవ వారికి నన్నముఁ గూరగాయలు

న్బచ్చడు లూరగాయలును భక్ష్యములుం గలమాన్నము, న్గడు
న్మెచ్చిక మీఱఁ బెట్టి గరిమంబునఁ బెంచెను గొన్నినాళ్లొగిన్. 5

క. కూనలు పెరఁగినఁ గుండయుఁ
దానయి పెరుఁగు ననుసామెత నిజం బనగా
నానాఁటఁ బెరుఁగు బాలుర 6
తోనవ ధాన్యావసరము తోరం బయ్యెన్.

మ. నెలకూన ల్పసివాండ్రు వీరి నకటా నే నెట్లు పోషింతునో
చలుదు ల్పెట్టుట కైనఁ జాల దిపు డీసంవత్సరగ్రాస మ
న్నలుకు ల్భామిని పల్కఁ బక్కున నగి న్బద్మాక్షభక్తుండు జ
వ్వులఁ బుట్టించినవాఁడు పూరి నిడునే పా మ్మంచు నూహించుచున్.

ఉ. ఉప్పును బప్పు నిండుకొనె నూరక బాలకు లేడ్చు రంచుఁ దా
నప్పులు చేసి పెట్టె సరి యయ్యెను బియ్యముఁ గూడ నట్టిచో
నెప్పుడు నిట్లె వచ్చు నిక నెన్నఁడు తీర్పు నటంచు సొటివా
రొప్పక యుండి ర ప్పుడఁగ నుత్తమ యైనకుచేలుపత్నికిన్. 8

శా. అమ్మా పప్పులు దెచ్చిపెట్టు మనువా రాఁకొన్నవా రేడ్చువా
రిమ్మా బొమ్మల నాడుకొందు మనువా రె ట్లైగుచున్నావు, మా
తమ్ముం డ్పాలిడి నిద్రపుచ్చు మని చెంత న్నిల్చువా రెత్తికో
రమ్మా యం చెగఁబ్రాఁకువారు నయి రారామణిం బుత్త్రికుల్. 9

శా. ఈరీతి న్సతి యోర్పుతోఁ గడపె నద్యో డప్ప ధాన్యాదులుం
జేర న్వచ్చిన నప్పు దీర్చికొని గంజిం గాచి వడ్డించెఁ గ
న్నీరొలర్ప న్సుతులార త్రావుఁ డనుచు న్నిత్యంబు నత్యంతమా 10
దారిద్ర్యంబున కోర్వలేక తనసంతానంబు నీక్షించుచున్.

సీ. పసిబిడ్డఁ డేడ్వంగఁ బ్రక్కలో నెడబిడ్డఁ
డేడ్పించుచుండుఁ బాలిమ్మటంచు
నాఁకొన్నబిడ్డఁ డల్లడల నాఁకటం డేడ్చుఁ
బిడికెఁ డన్నముఁ దెచ్చి పెట్టు మనుచు
గంజి ద్రావినబిడ్డ కన్నీరిడఁగ నాఁకటఁ
దడుగును క్షీరాన్న మమ్మ యనుచు
వస్త్రమ్ముల కొఁకండు వాపోవ నాఁకటండు
పోరుపెట్టఁ దొడంగుఁ బొత్తమనుచు
నకట దైనము నిరుపేద లైనవారి
కమితసంతాన మిట్టు లీయంగఁ దగునె
న్నారుఁ బోసినవాఁ డేల నీరుఁ బోయఁ
డనెడు లోకోక్తి నాచెంత ననృత మగునె. 11

మ. అని కన్నీరిడుధర్మపత్నికి ముదం బౌనట్లు శ్రీకృష్ణునిం
గనిరా నెంచెఁ గుచేలుఁ డప్పు డడుఁగుల్ గానుక న్సమర్పింపుఁ డం
చును జీరెంబునఁ గట్టె నామె యతఁ డచ్చో వాసి శ్రీద్వారకం
గని తద్రక్షకుల న్నుతించెఁ దనరాకం గృష్ణుతోఁ దెల్పఁగన్.

ఉ. వారలు నవ్వికొంచుఁ జని వారిజనాభ కుచేలవిప్రుఁ డీ
ద్వారక కేగుదెంచె మనద్వారముచెంగట నున్నవాఁడు శృం
గార మొకింత లేదు నుడికాఁడు సొంపుగలాఁడు మీకుముం
గూరిమిమిత్త్రుఁ డంచు నిటకుం గొనిరా నెల వౌనె నావుడున్. 13

చ. పరమకృపన్ గుచేలు యదుబాలుఁ డెదుర్కొని కౌఁగలించి కే
లకరమునఁ బట్టి క్షేమమె సఖా యనుచు న్వరిపాన్పుపై సుఖా

క. రావోయి మిత్రమా యని
మావనితాభర్త రత్నమయభూషణసం
భావితుఁ గావించుచు బల
దేవునిఁ బిలిపింప నతఁ డతిత్వరితగతిన్. 20

ఉ. వచ్చి సరోజనాభుఁ డిడువందన మందుచు మిత్రపుంగవుల్
గ్రుచ్చి కవుంగిలించి కనుఁగొంటి సఖా సుదినంబు నేఁ డనె
నచ్చపుఁ బల్కు భక్ష్యములు మేల్మి రసాన్నములు న్భుజించెఁ బె
న్మచ్చట వీడెము ల్గొనుచు ముప్పురు మిత్రులు మాటలాడుచున్.

మ. బలదేవుండు వినంగఁ గృష్ణుఁ డలవిప్రగ్రామణిం గాంచి స
త్కులపత్నీమణి సేమమే సుతులు నీకుం గల్గిరే విద్యలం
దెలివిం గాంచిరె బంధు లెల్ల సుఖులే దేశంబు దుర్భిక్షబా
ధలపా ల్గాక చెలంగునే తదధిపుల్ దర్శింతువే నీ వనన్. 22

చ. సకలవిదుండ వీవు త్రిదశస్తవనీయుఁడ వీవు లోకనా
యకుఁడవు నీవెఱుంగనె మహాత్మ దయామయ శ్రీరమేశ నా
సుకృతము కాయ కాచి నినుఁ జూచునెపంబునఁ బక్వ మయ్యె నాం
డొకటియు నీకుఁ దెల్పఁబని యున్నదె యంచుఁ గుచేలుఁ డాడినన్.

ఉ. వెన్నుఁడు పిన్ననాఁటి చెలువి ప్రునిఁ గన్గొని రాముఁ డిట్లనున్
జిన్నతనంబునం గురుని చెంగట విద్యల నేర్చునాఁడు వి
ద్వన్నుత యాటపాటల సదా ముద మందుట నెన్నుకొన్న ని
న్నెన్నఁడు చూతుమో యనుచు నెంచెద మంచు వచించెఁ బ్రీతితోన్.

శా. ఈరీతి న్సుఖ ముండె విప్రుఁ డట లక్ష్మీశేచ్ఛచే దివ్య సౌ
ధాగ్రామాదులు వస్త్రభూషణము లర్ఘ్యోధాన్యము ల్గోవ్రజా

గారంబు ల్వారసేవకు ల్గజతురంగవ్రాతము ల్గల్గి శ్రీం
గారోద్భాసి కుచేలగేహ మని పల్కం జెన్నుమీఱెన్ ధరన్. 25
ఉ. అత్తఱి విప్రుఁడు వీడ్కొలిపి రచ్యుతుఁడు న్బలభద్రుఁడు న్సహా
త్సత్తములార వత్తు నని సాదరుఁడై చనుదెంచె వీటికిం
జిత్తము లుల్లసిల్లఁగఁ గుచేలు నెదుర్కొన వచ్చి పుత్రుల
త్యుత్తమ యైనపత్ని నయనోత్సవముం బచరించి రట్టిచోన్. 26
సీ. ఒకభృత్యుఁ డేతెంచి సకలోపచారము
ల్గావించి మడివల్వఁ గట్ట నిచ్చె
నొకసేవకుఁడు దేవునకు నర్చన మొనర్పఁ
బుష్పగంధాదు లొప్పుగ నమర్చె
నొకపరిచారకుం డోగిఁ బంచభక్ష్యాన్న
మును దెచ్చి తాను వడ్డన యొనర్చె
నొకకింకరుఁడు భక్తియుక్తుఁడై విరజాజి
వీవన నొప్పుగా విసరఁ జొచ్చె
పుత్రమిత్రకళత్రసంపూర్ణహర్ష
యుక్తుఁ డయి భోజన మొనర్చి యున్నతార్థ
సాధములఁ గాంచి శ్రీకృష్ణు సంస్తుతించి 2
ప్రబలె ధరణిఁ గుచేలవిప్రవరుఁడు.

# శ్రీ సత్కథామఞ్జరి.

## ప్రహ్లాద చరిత్రము -

శా. శ్రీ లక్ష్మీపతి ద్వారపాలురు మునిశ్రేష్ఠోగ్ర శాపావృత
త్రైలోక్యప్రళయావహాసురతను ల్దుర్వాంధకారు ల్మహా
వ్యాళాకల్పులు కశ్యపాత్మజులు దుర్వ్యాపారలోలాత్మకుల్
హేళిం బేర్చి రిలన్ హిరణ్యకశిపుం డక్కాంచనాక్షుం డొగిన్. 1

ఉ. బాహుబలాఢ్యుఁ డయ్యును దపంబున బ్రహ్మవరంబు లంది ఘో
రాహవభూమి దేవతల నందఱ నోర్చి హిరణ్యనేత్రుఁ డు
త్సాహ మెలర్ప భూగ్రహణతత్పరబుద్ధి నదల్ప యజ్ఞవా
రాహ మెదిర్చి యద్దనుజు వ్రచ్చి వసుంధరఁ బ్రోచె నుద్ధృతిన్. 2

చ. అనుజుని నార్తియు న్నరిపరాక్రమము న్విని శోకవహ్నికి
న్మనమున రోషమారుత సమందజవంబునఁ దోడు చూప న
ద్దనుజవరేణ్యు నగ్రజుఁ డుదగ్రతపంబును మందరాద్రిపై
నానరుచు నుండె దేవనికరోగ్రవనంబు దహించుకోరికన్. 3

ఉ. అట్టితఱి న్మహేంద్రుఁడు భయంకరవృత్తిని దాడి వచ్చి త
త్పట్టణము న్వెస న్విడిచి పారెడి దైత్యులఁ జూచి నవ్వుచుం
బట్టపురాణి గర్భవతి పాపభయంబును దక్కి పెన్నెరుల్
బట్టి పరాభవింపుచు నభంబునకుం గొనిపోవఁ జొచ్చినన్. 4

మ. నను రక్షింప సమర్థు లెవ్వరో కదా నాథా, దయాంభోనిధీ
తను వెల్ల న్వడఁకంగఁ జొచ్చె నకటా దైన్యంబు వాటిల్ల నీ

శ్చెను వజ్రాయుధుఁ డయ్యయో, రిపునిచేఁ, జిక్కెంచితే, హా, విధీ
యని శోకించెను సాధ్వి; నారదుఁడు డాయన్వచ్చి తా నిట్లనున్.

దీన పతివ్రతాతిలక దుఃఖము గానక యేడ్చుచుండె ని
న్నానిని గర్భజాతుఁ డసమానుఁడు వైష్ణవభక్తుఁ డక్కటా!
స్త్రీనిహతి న్సుకీర్తి చెడు; దీనిధి వయ్యును నిండ గాంచదే?
మానుము మాను మిప్పని బ్రమాదము సు మ్మిది దేవతాధిపా. 6

అన నతఁడో మహాత్మ విను మంతటిదుష్టున కుద్భవించు పు
త్త్రుని చెగటార్పఁ బూనితి హితుండ నతఁ జౌట వచించి తీవు మే
లని చనియె న్సతీమణిఁ బ్రియంబునఁ బ్రోవ మునీంద్రుఁ డాశ్రమం
బున నిడి తత్త్వబోధఁ బరిపూర్ణముగా నొనరించి యంపినన్.

రాక్షససార్వభౌముఁడు వరంబుల నంది మదించి యాసహ
స్రాక్షముఖామరావళి నిరంతరముం జలపట్టి పోరి త
ద్రక్షితలోకము ల్గొని నిరంకుశవృత్తిని యజ్ఞభోక్తయై
దక్షత మీఱ లోకతతి దగ్ధమొనర్పఁగఁ జాలి భాసిలెన్.

సేవ లొనర్చుచుం గఠినశిక్షల కులుకుచుఁ దల్లడిల్లుచు
న్నావెత వాయు టెన్నఁడొ రమాపతి ప్రోవఁ దలంచు టెన్నఁడ
హా, విధి! యంచు దేవగణ మార్తిని జెంద భవిష్యదర్థము
శ్రీ వెలయ న్నభస్స్థలి వచించెఁ; దథాస్తనె దేవతాళియున్.

గర్భస్థుఁ డైననాఁడు పు
నర్భవ రహితంబు లయిన నారదువాక్కుల్
నిర్భీతి స్మరణ చేయుచు
నర్భకుఁ డుదయించె రాక్షసాగ్రణిసుతుఁ డై.

శా. ఆలగ్నంబు శుభగ్రహావళియు శుక్రాచార్యుఁ డీక్షించి ర
క్షోలోకాంతకుఁ డౌ టెఱుంగుటను సంక్షోభిల్లె నాత్మ న్సురలో
మే లంచు న్మద మంది రట్టితఁడెఁ బేర్మిం బుత్త్రభిక్షాదులం
త్రైలోక్యప్రజ గాంచెఁ దండ్రి పిలిచెం బ్రహ్లాద యంచు న్సుతున్.

ఉ. ముప్పురు తమ్ము లుద్భవిలి ముచ్చటగాఁ బెనుపొంద నగ్రజుం
డవ్వనజోదరుం దలఁచి యాడుచుఁ బాడుచు నుండెఁ దండ్రి వీఁ
డెవ్విధి శౌర్యసారుఁ డగు నేక్రియ బుద్ధిని గాంచు నంచుఁ దా
నెవ్వగ నొంది విద్యలను నేర్ప విధించెను శుక్రపుత్త్రులన్. 12

మ. చదివె న్శాస్త్రము లస్త్రశస్త్రసమితి న్సాధించె వేదత్రయిన్
ముద మొప్పం బఠియించె నెయ్యది గురు ల్మోదంబుతోఁ దెల్పి ర
య్యది పె న్వేడ్కఁగ నప్పగించుఁ గడుఁ బ్రహ్లాదుండు ధీసంపదా
స్పదుఁడై తజ్జనకుండు విద్యఁ గనునిచ్చం బిల్వ నంపె న్సుతున్.

చ. గురువులు తోడితెచ్చిరి ముకుందుని బాడుచు వచ్చు బాలకుం
గరముల్గఁ గ్రుచ్చి యెత్తి కృపఁ గన్గొని పెందొడ లందుఁ జేర్చి నే
ర్పరి వనిపించుకొంటె? యొక పద్యము చెప్పుము కన్నతండ్రి నాన్
హరిమయ మెల్లలోకములు నన్యము లే దన దైత్యుఁ డిట్లనున్. 14

శా. ఏ మేమీ, దనుజారివర్తనలు వీఁ డీరీతి వాక్రుచ్చె బో
ధామ్మాహాత్మ్యము చూపవచ్చిరె గురుల్ ధైర్యంబుతో నన్న నో
స్వామీ, మాదెస లేదు నేరము భవద్దర్పాదు లాచారచే
ష్టామర్యాదలు చెప్పినార మని రాచార్యాత్మజు ల్భీతులై. 15

చ. అమరవిరోధియాజ్ఞ గురు లర్భకుని న్గని సామ దాన భే
దములను బోధ చేయు కులధర్మము లైనత్రివర్గపద్ధతుల్

విమతులతో వాదించుచును వివేకముతో వరవిష్ణుభక్తితోఁ
గ్రమముగ మోక్షమార్గమున గాఢవిరక్తిఁ జెలంగ బాలుఁడున్. 16

సీ. దైత్యారి నెఱనమ్మి తనయుఁడు మానఁడీ పుత్త్రుఁ
జంపింతు నని యోఁడు తలఁపు చేసె
శూలగదాఖడ్గ శుంభత్కరాళితోఁ
గసరుచు మూఁగ రాక్షసచయంబు
బడఁద్రొక్కికొనుచు దిగ్భయఘీంకృతులతోడఁ
బొంగుచు వచ్చె నేనుంగుగుంపు
క్రూరవిషార్చులుకుఁ గ్రక్కు బుసగొట్టి
వీగుచుఁ జనుదెంచె భోగికులము
విసరె సుడిగాలి హోమామాగ్ని వెలచి మండె
నీరనిధి పొంగ ధర క్రుంగ మేరు వడఁకె
వీరు లభిచార హోమంబు వ్రేల్చఁ జనిరి
భానుఁడు వెలింగ శశి మంచు సోన గురిసె. 17

మ. మఱియు న్మారణకర్మము ల్సెలఁగ రమ్మా దుర్మతీ! యంచు నెం
దఱు నెట్టెట్టు లదల్చి పాట్లిడినఁ జిత్తస్థైర్యుఁడై చొచ్చుచు
న్వెఱువ న్బాలక శ్రీహరిస్మరణతో నగ్గెం గుమారుం డెద
న్వెఱచెం దైత్యుఁడు పుత్త్రవైరమునకు న్నిర్భీతికి న్శాంతికిన్. 18

చ. నృపులు గృహస్థులౌ కథలు నేర్ప విధించెను దైత్యుఁ డగ్గురు
ల్నిపుణత నేర్పుచో విమతనీతులు పామ్మని తోడి బాలురం
గృపఁ గని బోధ చేసి హరికి న్వరభక్తులఁ జేసె బాలుఁడ
య్యపకృతిఁ దెల్పి తండ్రికడ నర్భకు నిల్పిరి శుక్రపుత్త్రకుల్. 19

క. తేజము వెల్గఁగ రాక్షస
రాజు కనలి కటము లదరఁ బ్రహ్లాద సుతా
తాఁ జెడినకోతి వనముం
బోఁ జెఱిచినయట్లు కులముఁ, బొలియించెదవే? 20

శా. శత్రు, ల్భ్రాతృచయంబు, దిగ్వితతులు, న్నస్త్రాస్త్రపంక్తు, ల్దివా
రాత్రంబు, ల్నరదేవయక్షనరతిర్యగ్జాతులు న్దిక్పతుల్
పుత్రా, బ్రహ్మవరప్రభావమున నన్బోకార్పఁగాఁ జాల రిం
కేత్రోవం గనుగొన్న మత్సములు లేరీరేడు లోకంబులన్. 21

చ. దనుజవిరోధి మున్ను పినతండ్రి వధించినపాపి వాఁడు నే
నని మొనఁ జంపఁ జూచితి భయంపడి డాఁగెనొ, మనికి వీడెనో,
జనకవిరోధి వై సహజశౌర్యము వమ్మొనరించి వంశవ
ర్ధనపదవిం గలంచుచుఁ గృతఘ్నుఁడ వైతివె దుర్మతీ యనెన్. 22

ఉ. వేదవిదుండు సత్త్వగుణవిశ్రుతకీర్తి విరాజితుండు లో
కాదరుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు భక్తియోగత
త్త్వోదయుఁ డబ్జనాభవిహితోజ్జ్వలశీలుఁడు బాలుఁ డైనప్ర
హ్లాదుఁడు తండ్రిఁజూచి వినయాన్వితుఁ డై పలికె న్మృదూక్తులన్. 23

సీ. నేను నీవ నెడియజ్ఞానంబు విడనాడి
చక్కఁగఁ జూడు రాక్షసకులేంద్ర
యీభూతసంఘంబు నీదిగ్వితానంబు
నీజీవకోటియు నీజగంబు
నెవ్వాఁడు కల్పించు నెవ్వాఁడు రక్షించు
నెవ్వాఁడు హరియించు నెఱిఁగి యుండు

# శుద్ధపత్రిక.

—:o:—

| పుట. | పఙ్క్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 1 | 6 | షు | ష్ణు |
| | 17 | మూ | మూఁ |
| 2 | 2 | సు | సుఁ |
| | 4 | ము | ముఁ |
| | 15 | నిఁ | ని |
| | 22 | ర్చి | ర్చ్చి |
| 3 | 3 | యు | న |
| | | త్రై | త్రైఁ |
| | 4 | కృ | కృ |
| | 12 | ల్గుకూ | ల్గు కూ |
| | 14 | టం జెందరి | రంగానది |
| | 20 | రఁ గృ | ర కృ |
| 4 | 5 | బోవు | బోవ |
| | 15 | ముక | ముఁగ |
| 7 | 1 | చు | చ |
| | 12 | కష్ణృ | కృష్ణ |
| | 14 | ల్బొ | ల్పొ |
| 8 | 6 | చ్చె | చ్చెఁ |

| | | | |
|---|---|---|---|
| 10 | 16 | ట్టన | ట్టణ |
| | 17 | దెప్ప | దిప్ప |
| 11 | 15 | రెక్క | ఱెక్క |
| | 16 | రెక్క | ఱెక్క |
| 12 | 19 | ఫుం | వుం |
| 13 | 1 | శ్రి | శ్రీ |
| 13 | 18 | క్ర | క్రము |
| | 19 | శ్రే | రే |
| 14 | 21 | ర్రై | స్త్రై |
| 16 | 12 | తోడు | తోరు |
| | 8 | ఫు | వు |
| 21 | 6 | మియు | మి |
| 23 | 7 | కికి | కకు |
| | 13 | స్ప | స్పు |
| 24 | 7 | ఫు | చు |
| 25 | 1 | ద్యాబ | ద్యాభ |
| | 4 | టిం | టి |
| | 12 | రి | రు |
| 26 | 22 | నర | నఱ |
| 27 | 14 | ప్ర | బ్ర |
| | 16 | ష్టా | ష్ఠా |
| 28 | 15 | టగా | టిగా |

| | | | |
|---|---|---|---|
| | 1 | ర | రుఁ |
| | 3 | 5ఁ | 8 |
| | 5 | నా | నా |
| | 19 | తోఁ | తో |
| | 14 | డుగు | టుకు |
| | 1 | ర | అ |
| | 2 | భా | బా |
| | 9 | వేఁ | వే |
| | 13 | డ | డఁ |
| | 14 | కెఁడు | కెడు |
| | 15 | వే | నే |
| | 19 | ణు | కు |
| 52 | 12 | ను | చు |
| | 14 | రె | జై |
| | 16 | పు | చు |
| 53 | 10 | త్వ | త్ర వ |
| | 16 | న్హ | న్హఁ |
| 55 | 6 | మూ | మూఁ |
| | 17 | అు | అ |
| 56 | 22 | ఊ | ఊఁ |

☞ తఱచుంగల తప్పులు- చదువరులు దిద్దుకొనఁ బ్రార్థితులు.



# ఏతద్గ్రంథకర్త్రిచే రచియింపఁబడిన గ్రంథములు.

| | | రు- | అ |
|---|---|---|---|
| పూజావిధానము (పాటలు, కీర్తనలు) | ... | 0 | 3 |
| రామేశ్వరయాత్రా చరిత్ర (నిర్వచనము) | ... | 0 | 3 |
| శ్రీ కాళహస్తీశ్వర కల్యాణోత్సవము (వచనము) | ... | 0 | 2 |
| శ్రీ విక్టోరియా మహారాజ్ఞీ చరిత్ర- (హూణభాషాంతరీకరణముతో) | ... | 0 | 4 |
| స్యమంతకమణి (ఐదంకముల నాటకము) | ... | 0 | 8 |
| వసంతర్తు వర్షర్తు వర్ణనము; సుఖము; మనీషాపంచకము; ధూమశకటము; మోతీమహాలు; నక్షత్రశాల (నిర్వచనము) | ... | 0 | 2 |
| శ్రీ సత్కథామఞ్జరి; మొదటి సంపుటము | ... | 0 | 4 |

ప్రతులు వలయువారు,

భువనగిరి కోదండపాణి,

డా॥ రిజస్ట్రారుగారి బస,

కాకినాడ.

అని వ్రాసినఁ బడయ గలరు.

అంచెకూలి కొనువారే భరింపవలయును.